శ్రీ ఆవ్వారి పెద్దరంగపార్య

# రాష్ట్రాటి నిర్వచన రామాయణము

(పూ ర్వ భా గ ము)




రచయిత :

చి త్ర క వి శే ఖ ర

శ్రీ రాష్ట్రాటి ఓబిరెడ్డికవి

# శ్రీ అవ్వారి పెద్దరంగపార్య
# ప్తాటి నిర్వచన రామాయణము

(పూర్వభాగము)


రచయిత :

చిత్రకవిశేఖర

**శ్రీ రాప్తాటి ఓబిరెడ్డికవి**

కల్లమడి (వయా) తరిమెల.



ప్రచురణ :

**శ్రీ అవ్వారి నారాయణ గ్రంథమాల**

బుక్కరాయ సముద్రము

అనంతపురం జిల్లా.

మా తండ్రి అవ్వారి పెద్దరంగప్ప పేరుతో నిర్వచన రామాయణమును వ్రాసి నాకు అంకితమొసగిన శ్రీ రాప్తాటి ఓబిరెడ్డిగారికి కృతజ్ఞత ప్రకటించుకొనుచున్నాను.

ఇట్లు
**విద్వాన్ అవ్వారి నారాయణ**


ఈ గ్రంథ ముద్రణకు తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే రూ. 6737 లు. ఆర్థిక సహాయ్యము లభించినది. అందుకు నా కృతజ్ఞత తెల్పుకొనుచున్నాను. — అవ్వారి నారాయణ





ద్వితీయ ముద్రణము : 1997 సం॥

కాపీలు : 1000

**వెల : రు. 25-00**

ముద్రణ ;

వంశీకృష్ణా ప్రింటర్స్ - విజయవాడ-2.

# అంకితము

గీ॥ బుక్కరాయ సముద్రంబు లెక్క కెక్క
పద్మశాలి కుటుంబ శోభను దలిర్ప
ధరణి నవ్వారి వంశంబు ధన్యత గన
నలరినాడవు నారాయణార్య వర్య !

గీ॥ తండ్రియగు పెద్దరంగప్ప ధర్మనిరతి
గౌరవస్ఫూర్తి పురమున ఘనతగాంచ
జనని అచ్చమ్మ సమ్మదస్వాంతగాగ
నలరినాడవు నారాయణార్య వర్య !

గీ॥ ప్రాణసతియైన రంగమ్మ భక్తిదనర
తనయు లేవురు ముగ్గురు తనయ లెనఁగ
తెలుఁగు పండిత పదవిని దివ్యకీర్తి
నలరినాడవు నారాయణార్య వర్య !

ం॥ పెదరంగపార్యు పేరిట
సదమలగతి రామకథను సంపూర్ణముగా
నొదవింపగఁ దన పుత్రుఁడు
ముదమున ననుగోర వ్రాయఁబూనితి నెమ్మిన్

గీ॥ సంతతము సాహితీవృద్ధి సలుపుచున్న
నీ మనో నిర్మలత్వంబు నెమ్మిదలఁచి
సమ్ముదమున నీ చరిత్రమ్ము నీకు
నంకితమొనర్తు నారాయణార్య వర్య !

* * * *

# శ్రీ అవ్వారి పెద్దరంగప్ప

—o—

సీ॥ వైవాహికముల దైవారాధనలఁ గార్య
నిర్వాహకస్థుఁడై నెగడినాఁడు

తగవు లెక్కఁడనున్న దర్శించి సమదృష్టి
రాజీలొనర్చి యెలర్చినాడు

ఘనత పెత్తందారుగా నిత్య సద్ధర్మ
నిరతుఁడై ప్రఖ్యాతి మెరసినాడు

కాంక్షదీర పురాణ గాథలాలోకించి
ఆచార నియతిని యలరినాడు

తే॥ అనఘుఁ డవ్వారి పెదరంగప్ప యనుచు
ప్రజలు కొనియాడ భాగ్య సౌభాగ్యగరిమ
పుత్ర పౌత్రాభివృద్ధిని బొందినాడు;
పద్మశాలికులం బుర్వి పరిఢవింప.

కృతికర్త : రాప్తాటి ఓబిరెడ్డి కవి

# ప్రశంసలు

మీ సాహిత్యసేవకు మా జోహారులు.

— దేవులపల్లి రామానుజరావు

మీ సాహిత్యసేవ దినదినాభివృద్ధి నొందుచున్నది

— దివాకర్ల వేంకటావధాని

మీ సాహిత్య కృషి దొడ్డది

— గడియారం రామకృష్ణశర్మ

మీ సాహిత్యసేవ ప్రశంసనీయము

— సి. నారాయణరెడ్డి, బి. రామరాజు
రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, బులుసు వేంకటేశ్వర్లు

అవ్వారి వంశమౌక్తిక రత్నం స్వయం విబుధ రత్నం
విఖ్యాతి మియాల్లోకే స్వగ్రన్థైరి ర్వివిధైశ్చ సాహిత్యైశ్చః

— కప్పగంతుల లక్ష్మణశాస్త్రిలు

సారస్వత మహోనిధి రత్నోద్ధరణ క్రియా ప్రవణచిత్తః
అభినందనీయ చరితో నామ్నా నారాయణో జయతి

— కంటిమద్ది శేషశర్మ

అతని కగుగాక నిత్య కల్యాణసిద్ధి
సంపదృద్ధియు కీర్తి సంపత్సమృద్ధి
శారదా పాదపద్మ పూజా ప్రబంధ
పరిమళంబయి గృహమార బండుగాఁత !

— గడియారం వేంకటశాస్త్రి

అష్టదిగ్గజ స్వర్ణ సింహాసనములు
భువనవిజయమ్ము ఎదదలో పొదివికొనిన
సరస సాహిత్య సహృదయ చక్రవర్తి
అతడు అవ్వారి నారాయణప్ప సుమ్మ.

— నండూరి రామకృష్ణమాచార్యులు

సంస్కృతాంధ్రభోజుల కీర్తి సౌధములకు
క్షితిని బునాదిరాళ్ళై ప్రకాశించెఁ గృతులు
అన్న! అవ్వారి నారాయణాభిధాన
తత్త్వమెఱిగిన నీకుఁ దద్భాగ్యమబ్బు

— సి. వి. సుబ్బన్న శతావధాన

కం॥ నిబ్బరపుఁ దమిని దెనుగుం
గబ్బము లవ్వారిగాఁ బ్రకాశమునకున్
బ్రబ్బి కొనిదెచ్చు మీకున్
మబ్బడి యాయుర్యశః ప్రమోదము లొదవున్

— మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

నీ రమ్య యశస్సు ధాత్రి నిలుచున్ తిరమై — బెళ్ళూరి

శాశ్వత యశః ప్రకాశ ప్రశస్తకృతులు
కొను ఘనులు లేరు నారాయణునకు జోడు

— ఆశావాది ప్రకాశరావు

కలుగడొక్కడు నూటికి కల్లగాడు
భువిని నారాయణను బోలు పుణ్యమూర్తి

— గుంటి సుబ్రహ్మణ్యము

రసాస్వదన తప్తహృదయుండు, సరసగుణుడు
ప్రేమ నలరుగాక నారాయణుండు —నారునాగనార్య

అమృతకళలాని సంతుష్టి నమరగొనిన
ధన్యజీవి నారాయణ పుణ్యమూర్తి.

— అన్నదానం నరసింహాచార్లు

రాజుల్ పోయిరి-మహామాత్యులు లేకపోయిరి -
మాకై జాలిపడువారు మీరేగదా శ్రీ అవ్వారి నారాయణా!

— నారపరెడ్డి పెద్దిరెడ్డి

మీ ఉద్యమము ప్రశంసనీయము. —జోస్యము జనార్ధనశాస్త్రి

మీ సాహిత్య కృషి, సేవ ప్రశంసనీయము. — రాజన్నకవి

ఎవ్వారున్ సరిరారు నీకిపుడు బ్రాహ్మీసేవనంబందు నీ
మవ్వంపుం గవనంబు కావ్యపతితల్ మైమై కవీశావనం
బవ్వారాజ్ఞసను రాణికీవిడు సువర్ణాలంకృతుల్ మించె ఓ
అవ్వారన్వయ చంద్రకీర్తి గనుమత్యంతంబు నారాయణా!

నెలకొక పుస్తకంబు రమణీయముగాఁ బ్రకటించుచుంటి, నీ
లలితహృదబ్జ పీఠమున లాస్యముసేయుచు నాంధ్రభారతీ
లలన సదావసించునని లక్ష్మణశాస్త్రి నిరతంబు నీ
విలసదతుల్య దీక్షఁగని విస్మయమందుచునుండె సత్కవీ!

ఇది నా హృదబ్జ పుటమున
విదితంబుగ నిల్పికొన్న విస్తృత భావం
బుదితంబయ్యెను సుఖుకుచు
ముదమవ్వారిందరి కనుమ పూర్ణాయువులున్!

దొడ్డ రాష్ట్రాటికులఁ డోబిరెడ్డి నిన్ను
లలిత కావ్యరత్నముల నలంకరించె
కర్తచే భర్త, భర్తచేఁ గర్త కావ్య
సౌధమున విభూషితులై రి సమ్మదమున్

అవ్వారి వంశచంద్రా !
ఎవ్వరికిని సాధ్యపడని యేద్వైరతోడన్
మవ్వంపు సొంపు సొన్నపు
మువ్వలతో పలుకు చెలిని ముంచితివౌరా!

**శప్పగంతుల లక్ష్మణశాస్త్రులు**
హైదరాబాద్,
తేది : 2-2-75.

—)0(—



శ్రీ అవ్వారి నారాయణ, రంగమ్మ దంపతులు

# లేఖ

మిత్రులు శ్రీ అవ్వారి నారాయణగారికి శుభాభివందనములతో వ్రాయు లేఖ. మీరు పంపిన ముకుందవిలాసః, జ్ఞానానంద శతక మందు కొన్నాను. మీ సాహిత్యసేవ అమోఘము. అనన్యదృశ్యమైనది. స్వయముగా రచయితగా నుండి తెలుగు పండిత పదవిలోనున్న ఎవరికిని గూడ మొత్తము దేశమునందు మీ వంటి ఉదారులను కని విని యెఱుగను. మీ జీవితమే సాహిత్య తపస్సంపన్నము. అధీతి, బోధ, ఆచరణ, ప్రచారములు నాల్గింటను మీరు కృతహస్తు లనిపించుకున్నారు. ఇది మిమ్ము పొగడుట కాదు. వస్తుస్థితి కథనము మా వంటివారికెవరికిని అసాధ్యమైన సేవ మీరు సరస్వతీదేవికి చేయుచు ధన్యులై తిరి. మిమ్ముగూర్చి వ్రాయుటకు పదములు, కలము దొరలకున్నవి. దిగ్భ్రాంతి చెందుచున్నాను. మిమ్ము చూచి కాని తృప్తి కలుగదు.

కప్పగంతుల లక్ష్మణశాస్త్రిలు,
69 ఆదర్శనగర్,
హైదరాబాద్—1-3-75.

## శ్రీ అవ్వారి పెద్దరంగపార్యు

# రాప్తాటి నిర్వచన రామాయణము

## ప్రథమ భాగము

ం॥ శ్రీ రమణీ రమణా సువి
చారణ మురహరణ దురితసాగర తరణా
కారణ కారణ మత్కృతి
సారస్థితి మనుపు సుజన సన్నుతచరణా! 1

ం॥ గణనాయక శుభదాయక
ననుఁ బాయక విఘ్నముల నెనయనీయక నీ
తనయునిగా నను గనుగొని
మనుపుము సద్వాక్యసమితి మదినెలకొనఁగన్. 2

ం॥ శ్రీవాణీ అజురాణీ
పావన మృదుపాణీ నతసుపర్వశ్రేణీ!
సేవించెద నలివేణీ
ప్రోవుము నను కరుణఁబూని బుధసంత్రాణీ! 3

॥వె॥ మహిత సత్త్వకాయు మనుకులేశ విధేయు
జానకీ సహాయు చారు గేయు
దళిత దైత్యమాయు ధర్మైక సుశ్రేయు
నాంజనేయు భక్తి నభినుతింతు. 4

ం॥ అని యిష్టదేవతా ప్రా
ర్థన భక్తినొనర్చి కాళిదాసాది సుధీ
జనులగు సంస్కృత కవులను
మనమున ధ్యానించి వాక్సత్కృతి గలుగన్. 5

కం॥ వినయత నన్నయ మొదలగు
తెలుఁగు కవీంద్రుల దలంచి ధీయుత గురు వ
ర్యుని వెంకటాచార్యు నెమ్మది
ఘనతర భక్తిని దలంచి కౌతుక మెసఁగన్.

కం॥ రామాయణ చారిత్రము
సామాన్యులకెల్ల సులభ సాధ్యముగాగన్
కోమల వాగ్జాలంబుల
నీమమున రచింతు గోస్తనీ పాకముగన్.

గీ॥ యోజన ద్వాదశం బైదు యోజనములు
పొడవును వెడల్పు గల్గిన పురవరంబు
దివ్యతరమైన కోసల దేశమందు
వెలయుచుండు నయోధ్య నా వినుతికెక్కి.

గీ॥ ఆ యయోధ్యను సూర్య వంశాధ్యులైన
ఇలబల, దిలీప, రఘురాజులేలి పిదప
రఘుసుతుం డజరాజు పరాక్రమమున
వసుధఁ బరిపాలనమొనర్చె వైభవముగ.

కం॥ ఆ నరపాలుని సుతుఁడు సు
ధానిధి సదృశాననుండు దశరథుఁ డమల
జ్ఞానాన్వితుడును సజ్జన
మానిత వర్తనుఁడుగాఁగ మహి నలరారన్.

కం॥ లంకాధి నాయకుఁడు దుర
హంకారము తోడ మునుల నమరులనెల్లన్
సంకట పరచుచు నుండఁగ
జంకున హరికడకు వారు చని దైన్యముగన్.

ఉ॥ శ్రీవర! దీనరక్షక- హరీ! పరమాత్మ! ముకుంద! కేశవా!
రావణు డాడి కెంతయును రాయిడిజెందితి మోర్వలేము, నీ
వే విధినైన వాని వధియించి మదీయ భయంబుదీర్చి వే
గావగదే యటంచు పదకంజములం బడి మ్రొక్కి నిల్వగన్. 12

ఉ॥ ఎంతయు జాలిజెంది కమలేశుడు వారల గాంచి యిట్లనున్
ఇంతకు మున్నె వాని విధమెల్ల నెఱింగిన వాడ నందుకై
మంతనమందు ముఖ్యమగు మార్గము నారయుచుంటి నింక నే
నంతమొనర్తు వాని, మనుజాకృతి జన్మమునెత్తి ధారుణిన్. 13

కం॥ అని తెలియజెప్పి పనిచిన
విని నారదమౌని వేగవెడలి ధరిత్రిన్
ధనుజాధీశుని సన్నిధి
ననువున గూర్చుండి యిట్టులని వచియించెన్. 14

గీ॥ వసుధ జాతస్యమరణం ధ్రువంబటంచు
పలుకుచుండెడి యార్యుల పలుకులెల్ల
వ్యర్థములు గావవెంతటి వారికైన
మానసంబున నెరుగుమో దానవేంద్ర! 15

కం॥ అని పల్కిన విని రావణు
డనఘా మరణంబు నాకు నాసన్నంబా
నని మనమున దలచితివా
యని ముదమునబలుక మౌని యౌననియనగన్. 16

శా॥ ఏమీ నారద! నాబలం బెఱుగవా? యీరీతి నా ముందటన్
సామాన్యుంబలె నెంచి పల్కెదవు, నన్ జంపంగ నుద్యుక్తుడౌ
ధీమంతుడెవడుండు ముజ్జగములన్ ఊహించి నిర్జింప నే
మోమోటంబికయేల తెల్పు సురలేమో ప్రేలియున్నట్లగున్. 17

క॥ లేకున్న యెన్నడేనియు
నీకరణిం బలుకవైతి విధి సంశయమౌ
తేకువను దెల్పుమని యన
నాకలహాశనుడు నిట్టులని వచియించెన్. 18

గీ॥ అసురనాయక నీకు రహస్యమొకటి
చెప్పెద మరెవ్వరికి నిది చెప్పబోకు
దశరథుని పుత్రుండై పుట్టి దానవారి
నిన్ను వధియించునని చెప్పె నిర్జరులకు. 19

గీ॥ ధరణిఫాల్గుణమున శుద్ధ దశమియందు
దశరథుండు కోసలాధీశ తనయనెలమి
బరిణయంబాడు నవ్వధూవరుల యందు
పుట్టునట శౌరి నినుజంప భూతలమున. 20

క॥ అనువుగ జెప్పుచు సురలను
పనిచిన నే నమ్మురారి పలుకులు నీకున్
వినిపింపంగ వచ్చితి నన
దనుజేశుండు సరకుగొనక తానిట్లనియెన్. 21

ఉ॥ ఎక్కడి శౌరి? నన్ను నశియించు టదెక్కడ? నాదు దారికిన్
జిక్కక దొంగరీతి జని చెట్టుల గుట్టలబట్టి భీతిచే
యెక్కడ దాగినాడొ గద, యిప్పటికిన్ దలయెత్తడాయెగా
తక్కిన మాటలేల నను దాకెడి వాడిల లేడు నారదా! 22

గీ॥ ఫాల్గుణము శుద్ధ దశమిని పరిణయంబు
కన్నులారంగ జూచి యిక్కడికి వచ్చి
మాటలాడుము పైకుంటు మాటయెంత
దిట్టమై యుండునో నీకు దెలియగలదు. 23

కం॥ అని పలికి తద్వివాహం
బును విఘ్నం బొనరజేయు పూనికతోడన్
దన యత్నమునఁ దగు చిం
తనఁ జేయుచు రాత్రిపగలు తనరుచునుండెన్. 24

చ॥ ఇది యిటులుండఁ గోసల నరేంద్రుని పెంపుడు పక్షి యొక్కటి స
మ్మదమున మాటలాడునది మానిని కోసలరాజపుత్త్రి నా
సదనమునందు గాంచి విలసద్గుణగణ్య యటంచు నెంతయున్
మదిని దలంచి యిట్టిదియె మానవనాథునితో బ్రియంబునన్. 25

చ॥ నృపవర సీతనూజకు గణింపగ బంక్తిరథుండు నాథుఁడై
యెపుడును సర్వధర్మముల నేమరకన్ బరిరంజితంబుగా
విపుల పరాక్రమ క్రమతి విష్ణుసమాన ప్రభావుఁడొందఁగా
జపతప హోమముల్ సెగడ శాశ్వత కీర్తి గడింప గర్గడిన్ 26

కం॥ అని తెల్పినంత నజ ఘూ
పుని సన్నిధిజేరి మోదమున నిష్టాగో
ష్ఠిని యుండి పెండ్లి విషయము
వినుపించిన సమ్మతించె విభుడును బ్రీతిన్. 27

కం॥ అంతట ఫాల్గుణ సితదశ
మెంతయు శుభమంచు నార్యు లెఱింగింపగన్
సంతసమున బనులన్నియు
శాంతముగా నిర్వహించి జరుపుచు నుండన్. 28

కం॥ భేరీ మృదంగ ముఖ వా
ద్యారావంబులు సెలంగ నతి వైభవతన్
ధీరుఁడగు దశరథుని శృం
గారించిరి పెండ్లిసేయఁ గౌతుక మెసఁగన్. 29

కం॥ క్రమపద్ధతితో గార్వ
క్రమములు నెరవేర్చి సుస్థిరంబగు సుముహూ
ర్తమున ప్రియాణంబై చను
సమయంబున వారి వాహ సంతతి మెండై. 30

ఆ॥ వె॥ మూఁగాలి ద్రోలి ఘోరున వృక్షముల్
మహినిగూల కూరు మబ్బుగ్రమ్మి
దిశలుమ్రోయ నుఱిమి దివినుండి కుండల
గుమ్మరించినట్టు కురిసె వాన. 31

ఉ॥ వాన విజృంభ మానముగ వచ్చుటచే సరయూ సరిత్తు నం
దా నరనాథు పెండ్లి జనులందరు దాటుచునుండు నంతలో
నేనుగులట్లు పైతెరలనేకము వచ్చిన దిక్కుఁదోచకన్
ఆ నదియందు వారలు భయార్తిని గొట్టుక పోవుచుండగన్. 32

కం॥ కొందఱు మునుగుచు దేలుచు
కొందఱు నొండొరుల బట్టుకొని వెలువడుచున్
గొందఱు ధైర్యము గోలుపుచు
నందఱు తీరంబుజేరి రజఙుఁడు దక్కన్. 33

కం॥ ఆదశరథుఁ డతి ధైర్యము
తో దరికేగుతరి నలలు త్రోయుచునుండన్
యేదాపు లేక శ్రీ దా
మోదరుఁడే దిక్కటంచు నురుతర భక్తిన్. 34

చ. పరమాత్మా! కరిరాజ రక్షక ! హరీ! పాపౌఘ విచ్ఛేదనా!
వరదా! దీనజనావనా! గుణగణా! వైకుంఠ నారాయణా!
కరముల్ పాదములాడకిన్ నిలిచె! నీ కాయంబునున్ సోలె! నే
దరిదాపున్ గనజాల నియ్యెడ నదిన్ దాటించిరక్షింపవే ! 35

సీగతి దశరథుఁ డడలుచుండ
ౌసల్య నివర్తించునట్టివేళ
డు మాయచేగొని లంక జేర్చి
ఁప మండోదరి సరసజేరి. 36

ందు క్రూరమగు శోకదలన్నిటికంటె నెక్కువౌ
ైన కార్యమిది భావమునన్ దలపోయ కీగతిన్
ముంపగా దగునె? నా మనవిన్ విను ప్రాణనాయకా
వజీ మణిన్ మరల యెప్పటియట్లు పురంబు జేర్పుమా. 37

ంతయు బ్రతిమాలిన
వమున శాంతిఁబొంది తగు మందసమున్
చ్చి యందు కౌ
జేర్చి సముద్రునిం బిలచి యిట్లనియెన్. 38

దసమును గై కొని
త్రం బోరులెఱుంగనీయక మిగులన్
న దాచి నాల్గవ
నా కిమ్మటంచు జలనిధికివ్వన్. 39

ంపలు గూల్చుట కిచ్చబూని
దుష్కార్య మొనరింప నెంచినాడొ
మున విఘ్నంబు గలిగెనేని
ులు దీయునని మది భయమునొంది. 40

ందుగల తిమింగల
కొనిపోయి యిచ్చి పూనిక తోడన్
యుండు రావణు
ది యనిచెప్ప నదియు భయమున గొనియెన్. 41

ఉ॥ అంతటవాని ఘ్రమముగ నద్యూడియున్ దలవాల్చి యుండ
చింతగఁదోచి యప్పటికి వేరొక నక్రియు వచ్చి దానితో
పంతము మీర క్రోధమునఁ బైఁబడి పోరఁదలంపఁ బేటిఁ
జెంతనెయున్న గట్టుపయిఁజేర్చి బలోద్ధతిఁ బోరుచుండగ

ఉ॥ క్రమ్మిన మాయశక్తి వదలంగ సతీమణి నిద్రలేచి నే
నిమ్మెయి దిక్కెయుండఁ గతమేమియొ యెట్టి ప్రమాదమొంఁ
యిమ్మహి నెట్టి పాతకము నేనొనరించిన దానగాను స్వా
తమ్ము కళంకజెందె నిఁక దైవమె నాకు శరణ్య మెన్న

గీ॥ క్షీరసాగరజాత దుష్కృత విఘాత
ప్రాకట ఖ్యాత మన్నాత లోకనేత
ఇందిరాసుందరీ లోకవంది తాంఘ్రి
కావవే నా మొరాలించి కరుణమీర.

కం॥ అని ప్రార్థింపుచు నుండిన
వనితామణి యెదుట లక్ష్మి ప్రత్యక్షంబై
కనికరము మీరగా ని
ట్లనియె సుధాధార లొలుకునట్టి పలుకులన్.

గీ॥ చింతజెందకు మమ్మ నీ స్వాంతమందు
నిర్జరులు కార్యభారము నిర్వహింప
వైభవంబుగ నీకు వివాహమగును
దైవవిధి యెన్నటికినాని తప్పదమ్మ.

గీ॥ మాయచే రావణుఁడు నిన్ను మందసమున
జేర్చి లగ్నంబు విఘ్నంబు సేయఁబూనె
నని వచించి యదృశ్యమై చనినయామె
తరుణి యటులుండ నక్కడ దశరథుండు

ఉ॥ ఏటి ప్రవాహమందుఁబడి యీదుచు నేమియు దిక్కుఁ దోఁచకన్
గాటపు సుళ్ళలోఁ దవిలి కంపము నొందుచు మున్గి తేలుచున్
జాటుగ హస్తి బృందగతి పైకొని వచ్చు తరంగ సంగతిన్
వాటముగాగ దొర్లుచును వారిధి చెంగటఁ దేరె గట్టునన్ 48

కం ఈరీతిగ దైవము
కూపారముఁ దరిజేర్ప చలికి వణకు జనింపన్
ఆ రాత్రి గడపి యువయువు
తీరమ్మునఁ దిరిగి తిరిగి దీనాననుడై 49

ఉ॥ ఎక్కడ పెండ్లి? కోసల యదెక్కడ? నావగు బంధు సంచయ
బెక్కడ? తల్లి దండ్రి గురువెక్కడ? సాగరతీర భూతలం
బెక్కడ? మత్పురంబు నికనే గను టెక్కడ? యేమిసేయుదున్
దిక్కును దోచకీ జలనిధిస్థలి యీగతిఁ గుందనాయెగా 50

కం॥ తొలి నే జేసిన కర్మపు
ఫలమిది యేమోయటంచు పనవుచు నచటన్
దిలకించుచుండ నొకయెడ
సలలితముగ మెరయు సుందనముఁ గన్పడియెన్. 51

గీ॥ అంత నాతండు సమ్మదస్వాంతుడగుచు
నటకుజని యూతవెరచిన యందులోన
తరుణి గనుపింప మది నద్భుతంబు నొంది
నిట్ట నిలువున మ్రాన్పడి నిలచి నంత 52

కం॥ నమ్మరు వారొక రొకరిని,
నమ్మరు తమలోనెదాము, నమ్మరు కనులన్,
నెమ్మనమున నరయుచు తుద
కమ్మహితుండిట్టు లనియె నా సతితోడన్. 53

కం॥ ఎవ్వతె వీవు మృగేక్షణ
యెవ్వఁడు నీకిట్టి గతుల నెనయించె నిలన్
జవ్వని నే సజతనయుఁడ
నివ్విధి నదిత్రోసి యుంచి యుదటికిఁ దేర్చెన్ 54

చ॥ అనియిటు బల్కుచుండ చతురానన, శంకర, శక్రులున్, మునుల్,
వనితలతోడ నచ్చటికె వచ్చి సమస్త మెఱుంగ జేయుచున్
ఘనతర మంత్రవాక్కు లెసగంగ వివాహ మొనర్చి మందసం
బున శయనింప జేసి వెసమూత వహించి యదృశ్యులైచనన్ 55

చ॥ మొదటి తిమింగిలంబు దృఢముష్టిని రెండవదాని నోర్చుచున్
గదనము జేసి క్రోధమున కండలు జీల్చి వడిం బరేతరా
ట్సదనము జేర్చి సాగరతటంబున నుంచిన పెట్టెదీసి స
మ్మదమున దాల్చియుండెను సముద్రుని యానతి నాత్మ బాయకన్

చ॥ ఇది యిటులుండ శౌరి విధియించిన కాలము దాటెనంచు స
మ్మదమున దానవేంద్రుఁడు సముద్రునిఁ జేరఁగ బిల్చి పేటికన్
సదనముఁ జేర్చు మంచనగ చయ్యనఁబోయి తిమింగిలింబుపై
నదనుగ నున్న పెట్టె వినయంబున రావణు చెంతఁ జేర్చినన్ 57

కం॥ ఈ రీతిని మందస మిల్లుఁ
జేరిన సమయమున విష్ణు చింతారతుఁడౌ
నారదుఁడచటికె వచ్చిన
గౌరవముగ నాదరించి కౌతుక మతియై 58

చ॥ మునివర కోసలాధిపుని ముద్దుకొమార్తె వివాహ వేడుకల్
కనుగొని వచ్చినారుగద కన్నుల పండువుగాగ నెంతయున్
వినవలెనంచు నా మదికి వేడ్కజనించెను తెల్పుమా జనా
ర్దనుఁడు విధించినట్లు మకరమ్మునఁ బెండ్లి సమాప్తమాయెనా. 59

కం॥ అని పరిహాసముగాఁ బ
ల్కిన మునివరుఁ దతని గాంచి కేశవుఁడు విధిం
చిన కార్యము నెరవేరక
చన దెన్నటికైన పెండ్లి జరిగెడి యుండున్. 60

గీ॥ అనిన చిఱునవ్వు నవ్వి దైత్యాధిపుండు
పెట్టె కడకేగి పైమూతఁ బట్టి తెరవ
దశరథుండును కౌసల్య దంపతులుగ
నలరియుండ సముద్రుపై నాగ్రహించి 61

శా॥ ఏరా సాగర! యింత నీకు పొగరా! యీరీతి నాయానతిన్
మీరం జాలితివా? దురాత్మ! కుటిలా! మిథ్యానులాపా! నినున్
ఘోర ప్రక్రియ ఖండఖండములుగా గోయించి ధాత్రీ కా
హారం బొసటు లేనొనర్తు నసఁగా నాతండు భీతాత్ముఁడై 62

కం॥ గడగడ వడకుచు పెదవులు
దడుపుచు హస్తముల్ మోడ్చి దానవనాథా!
కడుభక్తిని గొనిచని య
య్యెడ నొక్క తిమింగిలమున కిచ్చితి దీనిన్. 63

కం॥ అని యిటు దీనతఁ బల్కిన
దనుజుండు తిమింగిలమును తడయక బిలువన్
జనుదెంచి యదియు మ్రొక్కిలి
వినయంబున బల్కెనిట్లు వివరముఁ గాగన్. 64

గీ॥ రాజచంద్రమ మిగుల జాగ్రత్తతోడఁ
దీని తలదాల్చి కాచితిఁగాని నన్ను
మఱియొక తిమింగిలము వచ్చి మార్కొనంగ
ఘడియ కాలము నిదియుంచి గట్టుపైన. 65

ఆ॥వె॥ ఇంతకన్న నాకికేమియు దెలియదు
దైవ సాక్షికముగ దానవేంద్ర
అనిన నాదు మరణమునకుఁ గారణమైన
దీని నిప్పుడే వధింతుననుచు 66

కం॥ ఘన రోషంబున కౌస
ల్యను జంపదలచినంత నచ్చటికి విభీ
షణుఁ డేగుదెంచి యగ్రజు
వినయంబున నాపి పలికె ప్రియవచనములన్. 67

శా॥ అన్నా! శాంతి వహింపుమీ రమణిపై నాక్రోశమున్ బూనఁగా
జన్నే యన్నలమిన్నగన్న మదిలో జాలింతయుం గల్గదే
మున్నే పాపము కర్మమే నెరుగదీ పూఁబోడి, నా వాక్యముల్
మన్నింపందగదే దురాగ్రహమున్ మానంగదే మ్రొక్కెదన్. 68

కం॥ కాగలది కాకమానదు
పోగలదియు పోకవిడదు: పూర్వకృత ఫలం
బాగునె యేమొనరించిన
బాగుగ యోచింపుమన్న భావములోనన్. 69

గీ॥ ఇపుడుఁ దప్పిన యింకొక నెపముతోడ
నైన జంపక విడుచునే హరితలంప
తెలియజాలక స్త్రీని వధించి యిట్లు
ఘోర పాతకమునుగట్టు కొనఁగనేల? 70

కం॥ అని హితవాక్కులు బలికిన
తన మనమున శాంతిబొంది దశరథుఁ గౌస
ల్యను పురము వెడల ద్రోసిన
అను వారంగను జటాయువచటికి వచ్చెన్. 71

వచ్చి సమస్త సంగతులు వారలతోవిని మానసంబునం
బొచ్చెములేనివారు మహిమోన్నతులందు పురంబు చెంతకున్
ముచ్చటమీర వారలను మూపున దాల్చి మహోదయంబునన్
దెచ్చి విలాస వాటికను నుంచిన దాని సురల్ నుతింపఁగన్. 72

ఈవిషయ మిటులనుండఁగ
పావనుఁడగు తనయు నరయఁ బరిపరి విధులన్
సేవకుల నంపి తెలియక
భావంబున నజవిభుండు బహుదుఃఖితుఁడై. 73

అక్కటా యెచ్చోట నడలుచున్నాడవో
అలల తోపుడు కెంత యలసినావొ
మోదమారఁగ పెండ్లి ముచ్చటల్ గనబోయి
యీవిధంబునను దుఃఖింపనాయె
భరియింపజాల నీ పరితాప భరమింక
నిన్నుఁజూచెడి భాగ్యమెన్నడౌనొ
నా నోముల ఫలంబ! నా పెన్నిధానమా!
దశరథా! నాకూర్మి తనయ రార

ఎంత వెదకించినను గనుపింపవైతి
వెందు దురపిల్లుచున్నావొ దెందమందు
పాపి వర్షంబు మనకెంత పాటుజేసె
నాయనా! సుందరాకార! నాకుమార! 74

అని యడలుచుండగా నుప
వనమున కౌసల్యతో వివాహితుడై నీ
తనయుం డిపుడున్నాడని
వనపాలురు వచ్చి రాజవరునకు దెలుపన్. 75

ఉ॥ పెన్నిధి గన్న రీతిగతి పెండ్లికుమారుని చెంతకేగి నా
యన్న మదీయ కూర్మిసుత, యబ్రిపు నోములపంట నిన్ను నే
కన్నులఁజూచు భాగ్యమిట గల్గె, మనమ్మున చింతబాసె నీ
కన్నియతోడ నెల్లు తమకమ్మున వచ్చితివన్న తెల్పుమా! 76

కం॥ నీ వెక్కడ? సతి యెక్కడ?
యీవన మెక్కడ? జటాయువెక్కడ? మదిలో
భావింపఁ జిత్రమయ్యెను
ఈ విషయముఁ దేటపడగ నెఱిగింపు మనన్. 77

కం॥ జరిగిన సంగతులను సుతుఁ
డెరిగించిన దైవయోగమిది యని యపుడే
వరవైభవముగ వారిని
పురి జేర్చిరి సర్వజనులు పొగడుచు నడువన్. 78

చ॥ తనయుఁడు కోడలిచ్చటికి దైవవిధిన్ జనుదెంచిరంచు జా
బును లిఖియించి కోసలకు భూతలనాథుఁడు పంపినంత నా
మనుజ వరేణ్యుఁడక్కడ కొమార్తెను గానక దిక్కుతోచకన్
వనటను గుందుచుండి యటవచ్చిన లేఖనుగాంచి నంతటన్. 79

కం॥ సంతోషస్వాంతుండై
వింతయ్యెది తన తనూజ విధమున కెదలో
నెంతయు మురియుచు నచటికి
కాంతాపరిజనులతోడ కడు వడి జనియెన్. 80

కం॥ చనుదెంచి కూతునల్లుని
కనుగొని మోదంబుతోడ కలతెరగెల్లన్
విని సుత నల్లుని దోడ్కొని
చని క్రమముగ పెండ్లివిధులు జరిపిముగించెన్. 81

ఉ॥ ఈ విధిఁ బెండ్లి కార్యములనెల్ల నొగిన్నిరవేర్చి మించరయన్
పావనమైన దంపతులపార సుఖంబున గొంతకాల ముం
దే వసియింపఁజేసి యొక దివ్య ముహూర్తము నందయోధ్యకున్
బోవఁగ నిశ్చయించి తన పుత్రికతో జనపాలుఁ డిట్లనున్. 82

చ॥ పతికెదురాడకమ్మ! పెరవారలు చెప్పెడి దుర్మతంపు సం
గతులెదనుంచకమ్మ! బలుకష్టములొందినగాని సత్య వా
గ్వ్రతమును మానకమ్మ! కలకాలము నీకు శుభంబు గల్గు గా
వుత నిక బోయిరమ్మ! మరపుం గొనకమ్మరొ మమ్ము నెమ్మదిన్

కం॥ అని యీరీతిగ ధర్మము
లను తనయకు బోధఁజేసి లాలితమణి భూ
షణ వస్తువాహ నత్పరి
జనులాదిగ నరణమిచ్చి జనపతి పనిచెన్. 84

కం॥ మరి కొంత కాలమున కొక
తరుణిని కైకేయి నొక్క తరుణి సుమిత్రన్
వరవైభవమున సుతునకు
పరిణయమొనరించె నజుడు పరమప్రీతిన్. 85

కం॥ అజ భూపతి కొన్నాళ్ళకు
నిజతనయుని రాజుగాగ నియమించి ముని
వ్రజసన్నిధి మనమున భ
క్తిజనింపఁ దపంబు సలిపె దివిజులు పొగడన్. 86

గీ॥ దశరథుఁడు సంతతము ప్రజాదరణమొసఁగ
ధర్మనిరతిని రాజ్యతంత్రింబులెల్ల
వెలయగను పాడిపంటలు వృద్ధిగాగ
ధరణిఁ బరిపాలనమొనర్చి తనరుచుండె. 87

కం॥ జపములు పుణ్య వ్రతములు
తపములు సంతర్పణలును దానములెల్లన్
విపులముగఁ జేసి చేసియు
నృపవర్యుఁడు సుతులు లేక నిస్పృహఁ జెందెన్. 88

ఆ॥ వె॥ ఇటులఁ గొంతకాల మేగిన జనపతి
క్రూరమృగములెల్ల గుంపులుగను
వచ్చి పైరలెల్ల పాడుఁజేయుచు నుండ
ప్రజలు చెప్పిరిట్లు ప్రభునితోడ. 89

గీ॥ "దేవరా! యేమి చెప్పేది, దిక్కుఁదప్పి
అర్ధరాత్రి యాలలో పెద్దపులులు
కారుమన్నలు నిరతంబు గండమెరి
గుంపులై వచ్చి పైరన్ని కొల్లగొట్టె. 90

గీ॥ పుట్టినప్పటినుండియు భూమిలోన
యిట్టి దుష్ట జంతువ్రజంబు పెరుగలేదు
యేమి యన్యాయకాలమో యేమొగాని
మమ్ము గాపాడవలెనె మాన్యనాథ" 91

కం॥ అని యీగతి మృగబాధలు
వినుపించిన నభయమిచ్చి వీడ్కొని కడకన్
జనపాలుడు మృగయులతో
జనియెను తదరణ్యమునకు సంభ్రమ మెసగన్. 92

కం॥ అడవిని మునిదంపతులగు
కడువృద్ధులు సంఘమందు కావడితోడన్
కొడుకుఁగొని చనుచు నొగిర
మునుమును గాపాడుచుండు నెంతయు భక్తిన్. 93

ఆ॥వె॥ అచట రాజు మృగము లరయుచు వేటాడి
తిరిగి పురికి బయలుదేరునపుడు
చెట్ల మరుగునందు చెలగు సరసు న
మునిసుతుండు చెంబు ముంచుచుండ. 94

గీ॥ అపుడు బుడబుడమను శబ్దమరసి విభుఁడు
మరుగునం దేనుఁగనుకొని మహితమైన
శబ్దభేదిని యనదగు శరమువైన
పుడమిపై వ్రాలె సరచున మునిసుతుండు. 95

కం॥ అంతట దశరథుఁ డెంతయు
చింతా కులితాత్ముఁడగుచుఁ జెచ్చెరజని యా
చెంతఁబడియున్న విమల
స్వాంతుని మునితనయునెత్తి సంతాపమునన్. 96

గీ॥ అక్కటా మౌనిపుత్ర! నేనరయ కిట్లు
నిన్ను మూర్ఖతఁ జంపితి నిర్మలాత్మ
యేనుఁగని భ్రాంతిపడి వైచితి శరంబు
యెసఁగెఁ బాతకమింక నేనెట్లు గడతు. 97

కం॥ అని యెంతయు సంతాపం
బున కన్నులుమడిచి పలుక మునిసుతుఁ డతని౯
కనుగొని భూవర చింత౯
గొనకుము దైవవిధిఁ దప్పుకొనఁగా నగునే? 98

గీ॥ ఏనుఁ గనుకొని యిట్లు వధించినావు
తప్పు నీయందులేదు నా తల్లిదండ్రు
లందు లచ్చటనున్నవా రచటికేగి
దాహమునుదీర్చి తెల్పుమే తద్విధంబు. 99

ఉ॥ కోరిన కోర్కెఁ దీర్చెడి సుకాంతియు భూపుఁడు ఋష్యశృంగుఁ డా
సార చరిత్రునిం బిలిచి జన్న మొనర్పఁ గొఱంతలేక నీ
కోరికఁ దీరు భాగ్య మొనగూడును, మున్నొక రాజవర్యుఁ డిం
పారఁగ నమ్మునిం బిలిచి యుంచెఁ భాగ్యము నొందె భూవరా! 106

కం॥ అది యెట్లులనినఁ గాటక
మొదవి మహాకష్టగతుల నొందుచ నుండెన్
మదిగుంది రోమపాదుఁడు
విదితంబుగ మునులతోడ వివరింపగన్. 107

కం॥ ధాత్రీనాథ! విభాండక
పుత్రుండగు ఋష్యశృంగ మునువర్య సుచా
రిత్రుని రప్పించిన నీ
క్షేత్రములన్ వృష్టికురిసి క్షేమము గల్గున్. 108

కం॥ కాంతలన నెట్టులుండురొ
స్వాంతంబున దెలియఁడతఁడు సద్వృక్షములన్
గాంతలచే నట కంపిన
వింతఁగ మదివోచివచ్చుఁ ద్విప్రియముదలిర్పన్. 109

కం॥ అని యిట్లు తెలియఁబలికిన
జనపతి వేశ్యలను బిలచి సాహసమున యా
మునివరు దోడ్కొని రండని
పనిచిన సమ్మోదమంది పయనంబగుచున్. 110

గీ॥ పలువిధములగు భక్ష్యముల్ పళ్ళెరముల
నుంచుకొని రత్నభూషణ యుక్తముగను
ముని సమీపమునను జేరి ముచ్చటలర
సరస సంగీత నాట్యముల్ సలుపుచుండ. 111

కం॥ కనుగొని యద్భుతపడి యీ
మునులెవ్వరో? వీరి మంత్రములు భాషణముల్
వినవిన గడు మోదంబగు
నని వేశ్యలకడకుఁ జేరి యంచిత భక్తిన్. 112

గీ॥ వందన మొనర్చి యో మునివర్యులార
మీరు జపియించు మంత్రముల్ మీ జడలును
మీ విభూతి వల్కలములు మిగుల చిత్ర
ముగను దోచెను మదిని సమ్మదముగల్గె. 113

గీ॥ శిరముపై నొక్కటియెనాకు శృంగమెసఁగ
బొమ్మపై మీకు రెండేసి కొమ్మలెసఁగు
అందుపైనున్న రుద్రాక్ష లందముగను
వెలయుచున్నవి కనులకు వింతదోప 114

కం॥ అనిపల్కి కందమూలము
లనుకొని భక్ష్యములుదినుచు "నాహా! యివి మీ
వనములలో ఫలియించునె
గనుగొనవలె నవ్వనమును గౌతుక మెసఁగన్." 115

కం॥ అని యడిగి వారివెంబడి
చనుదెంచి నృపాలమౌళి సన్నిధిఁజేరన్
ఘన మోదమ్మున నృపుఁడ
మ్మునివరుఁ బూజించి యాగమును జరిపించెన్. 116

గీ॥ ఆ నృపాలుఁడు తనకూతు రైన శాంత
నమ్మహా మునికిచ్చి లగ్నంబొనర్చె
నచట సద్వృష్టిగురిసిసస్యములుపండి
సర్వ సౌభాగ్యగతుల దేశంబెలర్చె. 117

గీ॥ అపుడు ననుబిల్వఁబంచి సనత్కుమార
మౌనివర్యుఁడు దశరథ మనుజపతికి
సంతుగల్గు నిమ్మౌనిచే సవనమొనర
జేయఁగా దెల్పుమని నాకుఁ జెప్పెననిచె. 118

కం॥ కావున నీ యాగమునకు
పావను నమ్మునిని బిలువఁబంపు మనంగన్
కోవిదులగు భూసురుల ధ
రావల్లభుఁ డనిచె నాదరమ్ము దలిర్పన్. 119

గీ॥ అంత నమ్మౌనివర్యుఁడు కాంతితోడ
దశరథాధీశు చెంత కౌదార్యమెసఁగ
వచ్చి క్రమపద్ధతిని రాజవరునితోడ
పుత్రకామేష్టిఁ జేయించె బుధులుమెచ్చ. 120

కం॥ అంతట నగ్నిజ్వాలల
వింతఁగ నొక దివ్యమూర్తి వెలువడి నృప నీ
కాంతలకీ పాయసమిడు
సంతానముగల్గు శౌరి సాదృశ్యులుగన్. 121

గీ॥ అని యొసంగి యదృశ్యమై చనిన నృపుడు
జన్నము ముగించి యా పాయసంబుఁ దెచ్చి
సగము కౌసల్యకును మరిసగము కైక
కివ్వ వారు సుమిత్రకందిడిరి సగము. 122

కం॥ ఈ మాడ్కిని పాయసమా
కామినులును భక్తిమీరగా సేవింపన్
స్వామికృప గర్భచిహ్నము
లా మానినులందుఁ గల్గి యలరుచునుండన్. 123

గీ॥ శుభదినంబగు మధుమాస శుద్ధనవమిఁ
గమలనాభుఁడు కౌసల్య గర్భమందు
జననమందెను శ్రీరామచంద్రుఁ డవల
భరతుఁ డుదయించెఁ గైకేయి గర్భమందు

గీ॥ ఆవల సుమిత్రకును లక్ష్మణాహ్వయుండు
మరియు శత్రుఘ్నుడును జగన్మాన్యులైన
తనయులు ద్భవమొందిన దశరథునకు
స్వాంతమున సంతులేని కొఱంత దీరె.

కం॥ ఈవిధి నలువురు గలిగిన
భూవిభుఁ డానందమొంది భూసురులకు సం
భావనలు తనివిఁదీరఁగ
పావన దానంబులొసఁగె పరమాదరణన్.

కం॥ ఆ రాజు సుతుల నల్వుర
గారాబముతోడ పెంప ఘనతరశక్తిన్
సారతర సకలవిద్యా
పారంగతులైరి సత్ప్రభావ మెలర్పన్.

గీ॥ భవ్యమగు రామచరిత మవ్వారివంశుఁ
డైన నారాయణ సమాఖ్యుఁ డరయగోర
ధాత్రినానంద కార్తీక ధవళ తదియ
నొప్పుగ రచించె రాష్ట్రాటి ఓబిరెడ్డి.

## ర థ బం ధ ము

శ్రీశ, యుర్వీశ, పాతకనాశ, శౌరి,
అలఘు శుభమూర్తి, అవ్వారికులజుదోత్రిపు
నగరిపుస్తోత్ర, సుజనావనా, యశోధు
రీణ, రాజీవనయనా, పురాణకర్త.

శ్రీ
శ యు ర్వీ
శ పా త క నా
శ శౌ రి అ ల ఘు శు
భ మూ ర్తి అ వ్వా రి కు ల జు
దో త్రి పు న గ రి పు స్తో త్రి సు
జ నా వ నా య శో ధు
రీ ణ రా జీ వ
న య నా
పు రా ణ క ర్త

—:0:—

## —: ద్వి తీ య భా గ ము :—

కం॥ శ్రీ రామ పరంధామ కృ
పారామ గుణాభిరామ అంచితనామా
నారాయణా దయాకర
సారస్థితి గృతిని మనుపు సాహిత్యనిధీ.

గీ॥ మొదటిభాగ రామాయణమును రచింప
నరసి అవ్వారి నారాయణార్య్య డెలమి
బూర్తిజేయు మటంచును బ్రోత్సహింప
వ్రాయదొడగితి దక్కిన భాగములను

కం॥ శ్రీరామ జన్మచరితం
బారూఢిని ప్రథమ భాగమై యలరారన్
వారక రెండవ భాగము
నే రచియించెదను మిత్రునిష్టము దీర్పన్

గీ॥ అలవశిష్ఠునిచే విద్యలభ్యసించి
బలపరాక్రమములమించి ప్రాభవముగ
రవికులంబున పవిత్రమై రహివహింప
దశరథుని కూర్మిపుత్రులు తనరుచుండ.

కం॥ తనయుల మహిమల కలరుచు
ముని శాపముదలచి భయము బొందుచు నెపుడున్
ఘనమోదము ఘనఖేదము
మనమున జెనగొనగ నృపుడు మలయుచునుండెన్.

ఉ॥ ఆయెడ కొక్కనాడు మహితాత్ముడు ప్రాభవశాలియైన గా
ధేయుడు రాగ భూపతి విధేయత నమ్మునినాదరించి మీ
రీ యెడ నన్నుగోరి విధియించెడి కార్యమదెద్దియైన నే
జేయుదు నానతిమ్మనిన వేల్పుగ నమ్మునివర్యు డిట్లనియెన్. 6

చ॥ తరణికులేశ దుష్టులగు దైత్యులు నేనొనరించుయాగ మం
దిరముల రక్తమాంసములు తెచ్చి విదల్చుచు గార్యవిఘ్నముల్
విరివిగ జేయుచున్ గగనవీధి జరించుచు దుర్మదాంధులై
పరిపరిరీతులన్ మిగుల బాధలొనర్చుచు నుందురెప్పుడున్. 7

కం॥ క్రూరాత్ములు వారిరువురు
మారీచ సుబాహులండ్రు మానవనాథా
వారిని బరిమార్చుటకై
శ్రీరాముని బంపుమటకు చెలువారంగన్. 8

కం॥ మనుజాధిప బాలుండని
మనమున శంకింపబోకు మహనీయుని రా
మునిశక్తి నేనెరుంగుదు
మనకులగురువగు వశిష్ఠముని యెరుంగున్. 9

మ॥ అని మౌనీంద్రుడు పల్క రాజతిలకుండయ్యో యటంచెయ్యెడన్
ఘనమూర్ఛన్ బడి కొంతసేపటికి యాగాధేయునిన్ గాంచి యో
మునివర్యా యిదియెట్టికోర్కె కడిమిన్ బోరంగ సాధ్యంబె నా
తనయుండెక్కడ దైత్యులెక్కడ మదిన్ దర్కింపగా జెల్లదే. 10

కం॥ అనఘా దనుజుల ద్రుంపగ
పనిగొని నేవచ్చువాడ బాలుని రామున్
వినియోగింపగదగునే
మనవిని విని మత్కుమారు మన్పు మహాత్మా. 11

కం॥ అని యెంతయు బ్రతిమాలుచు
దనపాదంబులను వ్రాలి దాపసవరుడుఁ
జననాథ దుష్టులగు త
ద్దనుజులు నీచేతఁబడరు తర్కింపగన్. 12

ఉ॥ రాముఁడుగాక యెంతటి పరాక్రమవంతుడు వచ్చిపోరినన్
ఏమియు జంపఁబోడు మునిఁనెంతయు నేనుగ్రహించి మద్ర్వతం
బోమెడివాడు నీతనయు డొక్కఁడెయంచు దలంచి వచ్చితిన్
నీమది సంశయింపక గణింపుము నాపలుకుల్ నరేశ్వరా. 13

చ॥ అనియిటు బల్కుచుండ గురువైన వశిష్ఠుడుజూచి భూవరా
తనయుని బంపుమిప్పటికి తప్పక వారి జయించివచ్చు నీ
మునివరు డస్త్రవిద్య బరిపూర్ణముగా నెరిగించి యస్త్రముల్
ఘనముగనిచ్చి యెంతయు సుఖంబుగ బంపునటంచు దెల్పినఁ.14

ఆ॥వె॥ మదిని సంశయంబుమాని రాజేంద్రుండు
వరకుమారు మౌనివర్యువెంట
బంప నిశ్చయించి పయనంబు గావింప
నరసి లక్ష్మణుండు ననియె నిట్లు 15

కం॥ మాయన్న వెంట నేనుఁ
బోయెద చేదోడుగాగ బొలుపారంగఁ
శ్రేయముగ నానతిమ్మని
ఆయతివరునకును తండ్రికంజలి సేయఁ 16

ఆ॥వె॥ వారు సమ్మతించి పయనంబు గావింప
రామలక్ష్మణుల్ శరాస్త్రశస్త్ర
వితతిబూని సర్వవిబుధులు గొనియాడ
మౌనివెంట జనిరి మానితముగ. 17

గీ॥ ఇటుల సరయూతటమునజేర నెసంత
రామచంద్రునిగని మౌని ప్రబలమైన
విద్యలిచ్చెద నీకవి పెంపు బలిమి
యతిశయింపగనా స్నానమాడి రమ్ము. 18

కం॥ అని రాముని సుస్నాతుగ
నొనరించి మునీశ్వరుండు నురుతర విద్యల్
ఘనదయ నుపదేశించిన
యినతేజంబున వెలింగె నినవంశజుడున్. 19

చ॥ అటబయనించి పాడుబడినట్టి పురంబొక చోటగాంచి యే
మిటు పుటభేదనంబు గణియింపగ శూన్యముగాగదోచె వి
స్ఫుటముగ జెల్పుదేవ మునిపుంగవ యంచన గాధినందనుం
డటగల పూర్వగాధ పరమాదరణన్ వినుపించె నిట్టులన్. 20

గీ॥ బ్రహ్మచే వేయిగజముల బలమువడసి
దుష్టరాక్షసి తాటకి దోర్బలమున
మనుజులనుబట్టి మ్రింగుచు మదముమించి
పట్టణంబెల్ల నీగతి పాడుజేసె 21

కం॥ దీనిని వధియింపగ యే
మానవునకు వశముగాదు మానినియనకన్
పూని వధించుట మంచిది
మౌనులు సుఖమొందగలరు మహితగుణాఢ్యా. 22

కం॥ ఈరాక్షసి తనయులె యా
మారీచ సుబాహులని సమస్తచరిత్రం
బారూఢి దెలుపుచుండగ
నారాక్షసి యార్భటముగ నచటికి వచ్చెన్. 23

ఉ॥ వచ్చి యదల్చి వారిపయి వర్షమురీతిని రాళ్ళురువ్వగా
నచ్చపలాక్షి బాహువుల వస్త్రముచే వెగవైచి నంతటన్.
హెచ్చగు మాయగొల్పి యదియేచగ దానినిబట్టి దేవతల్
మెచ్చగ నొక్కవ్రేటుననె మేదినిగూల్చె జగద్ధితంబుగన్. 24

ఉ॥ ఆదివసాంత మందపటనాగి క్రమాగతమైన స్నానసం
ధ్యాదిగ నిత్యకృత్యము లొనర్చి మునీంద్రునిచే సమంచితా
స్త్రాదులనొంది కౌశికున కంజలిజేసి ప్రయాణమై సమం
త్రోదయమైన తద్విమలయోగి నివాసముజేరి నంతటన్. 25

కం॥ అయతివరు డతినైష్ఠికు
డై, యాగముసల్పబూన నసురులు తద్వి
ఘ్నాయత్తమతులై రక్తము
బోయగ జనుదెంచిరటకు భుజశక్తి మెయిన్ 26

కం॥ అదిగనుకొని శ్రీరాముడు
పదిలంబుగబూని వాయుబాణము వైవన్
ఉదధింబడి మారీచుడు
మదిబొగడుచు దరినిజేరి మౌనిగ నిలచెన్. 27

కం॥ ఆపిమ్మట శ్రీరాముడు
కోపమున సుబాహు నొక్కకోలన్ వైవన్
పాపము ఫలించినట్లుగ
పాపాత్ము డగ్నిగాలి భస్మంబయ్యెన్. 28

ఉ॥ అంతట రామలక్ష్మణుల నారసి దీవనలిచ్చి సన్మునుల్
సంతతమార యాగము బ్రశాంతముగాగ సమాప్తిజేసి వి
శ్రాంతిగనున్నవేళ రఘురామునితోడ బ్రసంగ సంగతిన్
వింతగ జానకీరమణి పెండ్లి విశేషము దెల్పిరివ్విధిన్. 29

॥ జగతి మిధిలాపురంబున జనకరాజు
యాగశాలకుదగు స్థలమరసి దద్ది
దున్నించునప్పుడు చిన్న బాల
మందసముతో బయల్పడె మహిమమీర. 30

ం॥ ఆలీల బాల నాగటి
చాలున జన్మించుకతన జనకధరిత్రీ
పాలుడు సీతాహ్వయమిడి
బాలనుగొని పెంచుచుండె పరమప్రీతిన్. 31

॥ ఆనరవర్యు నింటగల దిబ్బరుపైన ధనుస్సు దానినిన్
దానవ కిన్నరామరులు దాల్పగజాల రసాధ్యమైన ద
మ్మానవనాథుడాధను వమానుషశక్తిని బూన్చువానికే
జానకినిచ్చువాడనని చాటవచింపుచునుండు నెప్పుడున్. 32

॥ వె॥ శివధనుస్సు దాని చేపట్ట సామాన్య
మానవులకు సాధ్యమా ధరిత్రి
పూని తాల్మినెత్త బుద్ధ్యాత్మ నీచేత
నౌనుగాని యొరుల కలవియగు నె 33

ం॥ అని చెప్పి రామలక్ష్మణు
లను దోడ్కొని మౌనివరుడు రయమున నటకున్
జనుచుండ మార్గమధ్యం
బున శిలపై రాముపాదమును సోకంగన్. 34

॥ వె॥ రాయి విస్మయముగ రమణిగామారి సు
మాన్య రామాఖ్యుని సమస్కరించి
యరుగ రాముడరసి యాశ్చర్య మిదియేమి
విశదముగ చెల్పవే మునీంద్ర. 35

కం॥ అనియడుగ నతడు గౌతమ
మునిపత్ని యహల్య శాపమున రాయిగ నీ
వనమున నుండిన దీకథ
వినుపింతు నటంచు శాపవిధమిటు దెల్పెన్. 36

ఉ॥ శశిసతి పొందగోరె దివిజేంద్రుడు కాముకయుండి యెంతయున్
మోసమొనర్చి కోడివలె ముంగిట గూసెన వేళమీరె సం
చాసురమౌని గౌతము డహల్యనువీడి సరస్సు కేగ నా
వేసముతో సతింగవయ వేకువమౌని యెరింగి యుగ్రుడై. 37

దీ॥ రమణి కాఠిన్యమగునట్టి రాయిగాగ
అమరవరు దేహమెల్ల రంధ్రములుగాగ
శాపమిడి వారు ప్రార్థింప శాంతమొంది
రామపదధూళిచే రాయి రమణి యగుట
రంధ్రములు కన్నులగుట వరంబులిచ్చె. 38

కం॥ అని తెలియబలికి నంతట
ఘనతర కాననముదాటి కౌతుకమత్తు
జనకుని కడ కేగిరి యా
మునివరులును రాజసుతులు ముదము దలిర్పన్. 39

కం॥ ఆ రాజేంద్రుడు వారల
గౌరవముగ నాదరించి కడు మోదముగన్
శ్రీరాముని శూరత్వం
బాహూఢిగ మునులనుండి యరసినవాడై. 40

గీ॥ హరి చాపంబు గొనితేర శూరవర్యు
లైన మున్నూరుమందిని యంపినంత
వారు భుజశక్తి మీర సభాస్థలమున
తెచ్చి డించిరి శంకరు దివ్యధనువు. 41

జం॥ జనకుడు గని యాధనువున
పనిగొని జాణంబు దొడుగు బలయుతునకు నా
తనయ నొసంగ దలంచితి
ఘనగుణ యత్నింతువేని గైకొను మెలమిన్. 42

కం॥ ఎందఱు రాజులొ దీనిని
తొందరపడి యెత్తబోయి తూలుచును సభా
మందిరమున బడుచుండిరి
గ్రందుగ నొకడైన యెత్తగలుగడనంగన్. 43

కం॥ శ్రీరాముడు దానింగొని
నారిని దగిలింపబోప నది పెళ్ళుమటం
చారావమ్మున విరిగిన
నారసి యాతనికి సీత హారము వేసెన్. 44

కం॥ ఈవిధమంతయు దశరథ
భూవిభునకు దెలియనంప బొలుపారంగన్
ఠీవిని బరివారముతో
వైవాహిక విధులొనర్ప వచ్చెనతండున్. 45

గీ॥ రామునకు జానకీదేవి లక్ష్మణునకు
నూర్మిళాదేవి మాండవి నొప్పుమీర
భరతునకు నిచ్చి శ్రుతకీర్తి నురుగుణాఢ్య
నెలమి శత్రుఘ్ననకు నివ్వ నేర్పరుపగ. 46

చ॥ సరిగమపాధనీ పధనిసాధని సారిగమా యటంచు సు
స్వరముల మేళవాద్యములు సందడిసేయ మృదంగవాద్యముల్
ధరికిటతోంత ధిత్తకిట తద్ధిమియంచు మోర్గియగా
పరశుభ మంత్రియుక్తముగ వైభవలీల నెసంగె నచ్చటన్. 47

కం॥ తదనంతర మాజనకుడు
సదమల వస్తువుల నొసగి సంప్రీతి మెయిన్
ముదితలతో నప్పుర దమ
సదనంబుల కనుప వారు చనుచుండంగన్.

గీ॥ ఇరువదియొకమారు రాజులనేపడంచి
పౌరుషంబున నొప్పారు పరశురాము
డెదురుగావచ్చి నిలునిలుమెందుపోదు
రిపుడు నను గెల్చికాని ముందేగలేరు.

కం॥ అని పలికిన భార్గవరా
మునిచాపము రాముడుగ్రమున గైకొని యా
తని శక్తినంతయును గొన
వినయమ్మున సన్నుతించి వెడలె నతండున్.

సీ॥ ఈవిధంబున వారందరింపుమీర
పురము జేరి సదా జగత్పూజ్యులగుచు
పరమ సద్ధర్మనిరతులై భవ్యగతుల
వరలుచుండిరెంతయు వైభవముగ.

గీ॥ సరవి నీరీతి గొన్నాళ్ళు జరిగినంత
మానవాధీశ్వరుడు సభామందిరమున
వేడ్కమీర నిష్ఠాగోష్ఠి వెలయుచుండి
వినయమున వశిష్ఠునితోడ ననియె నిట్లు

గీ॥ కడిమి నరువదివేలేండ్లుగా ధరిత్రి
పాలన మొనర్చితి యింక భవ్యగుణు
డైన శ్రీరామచంద్రు బట్టాభిషిక్తు
జేయగా నిశ్చయించితి జెలువుమీర

కావున సుముహూర్తంబును
పావనముగ శాస్త్రరీతి బరికించి వెసన్
దేవ మునీశ్వర తెలుపం
గావలయునటన్న మౌని కౌతుక మతిమై 54

ఈ మధుమాస మందులకు నెన్నగ నెంతయు శ్రేష్ఠమై దగున్
నీమది నిప్పుడివ్విధి గణించుటమే కద ముందనమ్మ ని
మ్మరకన్ బ్రయత్న మొనరింపుము నేను ముహూర్తమెన్నెదన్
రాముని నిల్పఁబంచి వివరంబుగ దెల్పుము నాదుసేతకున్. 55

అని వచియించినంత దశరథనృప వాక్యముతోడ వర్తిలం
పును వినుపించి సమ్మతిని బొంద పురంబు నలంకరింప బ
ట్లునుపుగ జాటఁబంచి సుజనానుమతంబుగ సర్వకార్యముల్
పనుపడునట్లు సేవకులఁబంచి మహస్థితి నిర్వహింపగన్. 56

కైకేయిదాసి మందర
యీ కార్యక్రమమునెల్ల నెరిగి యమూలమున్
రాకాసియయ్యె రాముడు
మోకాల్ను బాల్యమందు మోదినకతనన్. 57

బిరబిర గైకేయీ మం
దిరమున కేతెంచి నెమ్మదిగ నుండిన యా
తరుణీమణితోడను కని
కరమున్నటు విన్నవించె గటకటనమమున్. 58

ఏమమ్మా చూచితివా
నీమమ్మింతయునులేక నీ సుతు వేరే
గ్రామమునకంపి రాముని
కీమహి పట్టంబుగట్టు నెలమి దలంచెన్. 59

చ॥ అని యిటుదాసిపల్కు మదమూరగ నానతి యాలకించి రా
మuni యభిషేక వార్త మదిమోద మెలర్పగ దెల్పినావు చే
కొనుము సువర్ణహార మిదిగోయన నెంతయు మూర్ఖవాదియై
కనుగవ నశ్రువుల్ దొరల గద్గద కంఠముతోడ నిట్లనెన్. 60

కం॥ దొసగులు గలుగుట దెలుపగ
నిసుమంతయు సరయజాల కీగతిహారం
బొసెగెదనంటివి తల్లీ
వసుధను నీకంటె వెట్టివారలు గలరే. 61

కం॥ నీసుతుడెన్నగ రాముని
దాసుండై తిరుగవలయు దర్కింపంగా
నే సవతిచెంత నీవును
దాసివిగా మెలగుటింక తప్పదు సుమ్మీ 62

కం॥ నలువురకు బంచి యివ్వక
యిలరాముని కొకనికేటుల నివ్వగదగునా
తిలకింపగ గౌసల్యయె
వలనుగ బోధించియుండవచ్చును పతికిన్ 63

కం॥ లేకున్న యిట్లొనర్చునె
కైకమ్మా యింతయైన గానవు మదిలో
నీకొఱకేగద యెంతయు
నీకరణిందెలుపవలసె హితమతి యనుచున్ 64

ఉ॥ వంతముబూని యాసువతి పట్టుదల న్వహియించి కైకకెం
తెంతయు బూటకంబులు వచించిన నారమణీలలామయున్
స్వాంతమునందొకింత దెలుపంబగు మాటలుగా గ్రహించి యీ
చింతలు దీరగల్గుగతి జెప్పగదేయని పల్కెనంతటన్ 65

గీ॥ శంబరునితోడ నీపతి సంగరంబు
సల్పువేళ వానిమాయల సాగకుండ
నీవొనర్పగ పతిమెచ్చి నీకు రెండు
వరములిచ్చెనటంటివి మరచినావె 66

కం॥ ఆరెండువరము లిప్పుడు
వారక భరతునకు మొదట పట్టముగట్టన్
గోరుము రెండవ వరముగ
నారాముని వనములకు నంపగ వచ్చున్. 67

కం॥ అని యారీతిగ బల్కిన
వినియానతి రాముని ట్లు విధియింపంగా
జనునే మూర్ఖమునాదే
యని పల్కిన యాసఖియిటులని వచియించెన్. 68

గీ॥ రాముడిచ్చట నుండిన రాజ్యపదవి
దక్కనిచ్చునే బవరమైన
జేసి సాధించు గావున జెప్పవలసి
చెప్పితిగాని నాయందు తప్పులేదు. 69

కం॥ ఇదిగాక రాముడడవుల
పదునాలుగు వత్సరముల పాటుండినచో
తుదినేమి సేయజాలడు
మదినెంతయు నరయుమంచు మరిమరి బలుకన్. 70

గీ॥ స్వాంతమునకైక యెంతయు జర్చజేసి
సఖియ నామేలుకోరికె యీసరణి యెరుగ
జేసితివి నాసుతుం డభిషిక్తుడైన
యప్పుడేనీకు మాణిక్యహారమిత్తు 71

గీ॥ అరయ నీకన్న మేల్గాట్చునట్టి సఖియ
ఎవ్వరునులేరు సురువజో నెన్నటికిని
ప్రాపునీవని నమ్మితి ప్రాణసఖియ
యనుచు నెంతయు బొగడుచు దనరుచుండ. 72

గీ॥ కైకతో రామపట్టాభిషేక వార్త
సభపుడెరిగింపగానెంచి యతిముదమున
వచ్చి పిలిచినయంత నవ్వారిజాక్షి
పలుకకుండనే బడియుండె పాన్పుపైన 73

గీ॥ పడతి నీవిట్లు పాన్పుపై బవ్వళించి
యింతమౌనము వహింప హేతువేమి?
ఎరుగజేయుము నీకోర్కె యెట్టిదైన
చేయగలవాడ నీకేల చింతనొంద? 74

చ॥ అని పతిపల్కగా నమ్మహిళ యామనుజాధిపుతోడ నిట్లనెన్
మునుపు రణంబొనర్చునెడ మోదముమీర వరద్వయంబు నా
కనుగ్రహనిత్తు గోరుకొనుమంచు వచించితి వవ్వరంబు లీ
దినమున గోరుకొందు వెనుదీయక దీర్పుమటంచు బల్కెనన్ 75

కం॥ సంతసమున నెరవేర్చెద
నింతీ యీమాత్రమునకె యీగతి మదిలో
జింతింతువె నావాక్యము
లెంతయు సత్యంబులగుట నెరుగవె నీవున్ 76

కం॥ అని పలికిన గైకయు నా
తనయున కీరాజ్యపదవి దనరించుట రా
ముని పదునాల్గేడులుగా
వనముల నివసించునట్లు బంపుట యనగన్. 77

గీ॥ మిను విరిగి మీఁద బడినట్లు జనవిభుండు
హా కుమారా యనుచు మూర్ఛ నవనిఁ ద్రాలి
కొంతపడికింత తెలివొంది యింతిఁ గరసి
వినయమున నామెతో నిట్టులని వచించె 78

శా॥ కాంతా యెంతటి మూర్ఖమూనితివి యాకౌసల్య పుత్రుండు నీ
కెంతో మోదముగూర్చు పుత్రుడెగదా యాతని వాక్రువ్వగా
పంతంబెందుకు గర్గె కాంతమతివై భావించి మోదించి మ
శ్చింతన్ బాయగజేసి సత్కృపను నాశీర్వంబులన్నిప్పుమా 79

కం అని ప్రతిమాలుచు బలికెన
వనితయు తనపట్టువిడక బలుమూర్ఖముతో
జననాథ నేనుగోరిన
ఘనవరములు తప్పకివ్వగావలె ననగన్ 80

కం॥ ధరణీశుడు వినయమ్మున
పరిపరి ప్రతిమాలి పలుక మాటలకెల్లన్
గరకున ప్రతివచనంబులు
విరసంబగునట్లు బల్కె వెరువక సతియున్ 81

గీ॥ ఇంతలో దెల్లవార సుమంతుడరిగి
మంత్రి యచ్చటి కేతెంచి మానవేంద్ర
శుభముహూర్తముగావచ్చె సురుచిరముగ
జరిపితిమి సర్వకార్యముల్ సత్వరమున 82

కం॥ అని తెలియబల్కె పిలచిన
మనుజేశుడు పల్కకుండె మానిని యంతన్
మునుకొని తనవరముల విధ
మును చెప్పెను మంత్రిచోద్యముగను వినంగన్ 83

గీ॥ అకట కైకేయి యిదియేమి యాగడంబు
ప్రభువుగారి మనస్సును పాడుజేసి
ఘోరపాతక మొడిగట్టుకొనగనేల
పరములను వేరువిధముగా బడయుమమ్మ

కం॥ అని మనసారి పలువిధముల
వినయమ్మునబలుక నామె వినకుండంగన్
మనమున నేమియు దోచక
కనుగొనగ బ్రమాదమైన గతియని మరలెన్

కం॥ అంత నతడు వేగమె జని
చింతాకలితాత్ముడగుచు శ్రీరామునితో
నంతయు వినుపించిన మతి
మంతుం డిట్లనియె శాంతమానసు డగుచున్.

చ॥ ఇదికదు మంచివార్త ధరణీసుడుగా సహజన్ముడౌటయున్
సదమలమూర్తితో మునులసన్నిధి సేవసించు టెంతయున్
ముదమగునంచు లక్ష్మణమె ధావరుసన్నిధికేగి నాయనా
ముదముగ సేవసంబునకు బోవగనెంచితి నానతిమ్మనినన్

కం॥ తనయూయుని మూర్ఛిల్లిన
మనుజేంద్రుని లేవనెత్తి మదిసంశయమున్
గొనకుము నేనడవులకున్
జని మౌనులకడ వసింతు సంతోషమునన్.

కం॥ నాతమ్ముడు సామ్రాజ్యము
చేతోమోదముగనేల జెల్లునుతండ్రీ
యీతీరున నీమనమున
భీతి ల్లక నానతిమ్ము ప్రియమారంగన్.

తల్లి సన్నిధికి యమ్మహితాత్ముడువచ్చి యంతయుఁ
ంతోడచెల్ప బృథివీస్థలి హాయని తల్లివ్రాలి నె
న గొంతతెప్పరిల్లి మాస్వచరిత్ర యిదేమి యిట్టులఁ
తెల్పవచ్చితివి ప్రాణములెట్టుల నిల్పనోపుదుఁ 90

ేములునోచి ఘాసురులకే నేమారకఁ సంపదఁ
ం దనియింపజేసి సురలఁ నేసేవించి సద్భక్తియై
గాంచి ప్రమోదమొప్ప మదిశాంతిం బొంది యుండంగ నా
యింతటిలోనె దుర్గతులపాలై పోవగా నోర్తునే? 91

ంతయు దుఃఖించెడి
ని శాంతపరచి తద్దయు సీతా
దెల్పగ నామెయు
యుగజాల వత్తునీవెంట ననెన్. 92

ాక్ష్మణు డచ్చటి కరుగుదెంచి
ామాట యొక్కటి యరసిచూడు
పాలించుటకు నీకుమాటయిచ్చి
కు బంపుటది యసత్యంబుగాదె. 93

షులందు వైవాహికములందు
త్త మానభంగములను
.. .... .... .... .... ....
చెప్పను సఘము బొందదనుచు 94

ప్రజ్ఞలు దెలుపగ
ు యరణ్యమేగ మనమాపేమ
తండ్రి మొదటి మాటకు
ను సామ్రాజ్యమునకు పట్టముబొందన్. 95

కం॥ ఈమాట దప్పవచ్చును
ఆమాటను దప్పగూడదని యే శాస్త్రం
బీమహిని జెప్ప నగ్రజ
మోమోటంబేల యిట్టి యిది పలుకులకున్. 96

కం॥ అని రోషమ్మున బల్కిన
యనుజన్మని మాటలరసి యారఘురాముం
డనఘా జనకుని నీవిటు
లన నోరెటులాడె ధర్మమరయగ వలదే. 97

ఆ॥వె॥ తండ్రియాజ్ఞ చేత తల్లిని జమదగ్ని
సుతుడు జంపలేదె చోద్యముగను
అరయకిట్లు రెగ్గులాడగ సరియౌనె
ఆగ్రహంబు మానుమని వచించె. 98

కం॥ అంతట లక్ష్మణు డెంతయు
శాంతుండై యన్ననరసి సంప్రీతిని నే
గాంతారములకు వచ్చెద
సంతసమున నీదు సేవ సలుపదలంతున్. 99

గీ॥ కాదనక నానతిమ్మని సోదరుండు
పలుక మనతల్లిగారిని కలతజెంద
కుండ గాపాడుమను జనకుండు మదిని
చింతగొనకుండ బరిచర్య సేయవలదె? 100

కం॥ కావున వారికి రక్షగ
నీవుండుట మంచిదనగ నేనెందుకు త
త్సేవకు భరతుడు దమ్ముడు
పావనమతులుండ్రు నేనుబరతెంతు ననన్. 101

ఉ॥ అందుకు సమ్మతించి మహితాత్ముడు తండ్రియనుజ్ఞనైకె చనన్
సందను గౌగిలించుకొని నాసుకుమార ఖలుండనైన న
న్నెందుకు తండ్రియంచు గణియింతువటంచు నరేంద్రుడెంతయున్
గ్రిందుగ నశ్రువుల్ దొరల గద్గదకంఠతబల్కె నివ్విధిన్. 102

కం॥ ఇక నాయసువులు నిలువవు
సకలమ్మును విడచివెంట జనుదెంతును బల్
వికలంబయ్యెను చిత్తము
నొకనిమిషము నిచటనుండనోపను రమ్మా 103

కం॥ అని లేవబోయి నంతట
జనకా నీవిటులబల్క జనునే క్షేమ
మ్మున బోయివచ్చువాడను
మనమున జింతింపబోకు మహితగుణాఢ్యా. 104

గీ॥ సీతయును లక్ష్మణుండును చెలువుమీర
కాననమునకు నావెంట గౌతుకమున
వచ్చుచున్నారు శంకింపవలదు వేగ
నానతిమ్మన గైకేయి యటకువచ్చి 105

గీ॥ మువ్వురకు నారచీరలు ముదముతోడ
యివ్వబోయిన నృపుడాగ్రహించి దుష్ట
చిత్త నీచేతులెట్లాడె ధీయటంచు
దివ్యవస్త్రముల్ సీతకు దెచ్చియిచ్చె. 106

కం॥ అంతట మువ్వురు వెడలి సు
మంతుండు రథమ్ముదోల మహితశుభాత్మల్
కాంతారములకు వెళ్ళిరి
సంతాపము తోడ వెంట జనులరుదేరన్. 107

ఆ॥ వె॥ దశరథుండు మిగుల సంతాపచిత్తుఁడై
మూర్ఛనొందు లేచు ముందుకరుగు
రామ రమ్మటంచును లక్ష్మణా రమ్మను
అదిగొ సీతవచ్చె ననియుదనును 108

గీ॥ రామరామయటంచు రాత్రింబవలు రాజు
పలవరించుచునుండె కడకు ముఖ్య
కాంతయైనట్టి కౌసల్యతో జెప్పె
మౌనిశాపమిడిన మహిమదెలియ 109

గీ॥ చెప్పినంతనె గౌసల్య శ్రీహరి యు
టంచు మూర్ఛిల్లి తెలివినొంది యధిపుడింక
బ్రతకడని యెంచి పతివెడబాయకుండ
కాచుకొనియుండె మిగుల జాగ్రత్తతోడ 110

కం॥ వనములకు జనెడి రాముని
వెనువెంటనె పౌరులెల్ల విడువక రాగన్
వెనుకకు జనుడిక మేమున్
జనియెదమన వారువిడచి చనకుండగన్ 111

గీ॥ కడకు తమసానదిం జేరి కౌతుకమున
స్నానసంధ్యాది కృత్యముల్ జరిపి రాత్రి
నందరిని నిద్రబోనిచ్చి యచటినుండి
కదలిపోయిరి పౌరులు గానకుండ. 112

ఉ॥ వారలునిద్రలేచి రఘువర్యునిగానక దిక్కుదిక్కులన్
ఆరసి దిక్కుతోచకను హా రఘురామ యటంచు నెంతయున్
దూరముపోయిచూచి తగుత్రోవ యెరుంగక దీనులై మరే
దారియులేక పట్టణముదారిని యిండ్లకుజేరిరందరున్ 113

ఉ॥ అక్కడ శృంగిబేరమను నట్టి పురంబున చెంచురాజు స
మ్యక్కరుణాత్ముఁడౌ గుహు డమానుషమూర్తులు రామలక్ష్మణుల్
ఒక్కట నుండుటారసి సమున్నత భక్తినివచ్చి వారికిన్
మ్రొక్కి యనేక కానుకలు మోదముతోడ నొసంగి యిట్లనెన్

ఆ॥ వె॥ రామచంద్ర యిట్లు రాజ్యంబు విడనాడి
యిటువసింపగల్గు హేతువేమి?
తెలియజేయు మట్టిఖలుదెవడుండిన
ధరణి గూల్చువాడ దర్పమెసగ 115

చ॥ అని వచియించినంత విమలాత్ముడు రాముడు వాని భక్తికిన్
మనమున మెచ్చి సంగతి క్రమంబుగ చెప్పిన నాతడెంతయున్
ఘనముగ చింతనొంది తమకంబున సేవలొనర్చ వారలా
దినమటనుండి సత్కృతులు దీర్చి సదంబడిలేచి వేకువన్ 116

గీ॥ పయనమైనంతట గుహుండు భద్రగతిని
పడవపై వారినెక్కించి భక్తిమీర
నెలమి గంగా స్రవంతి దాటించి పనుప
సంచితంబుగ వనవీథులందు జనుచు 117

గీ॥ అనువుమీర భరద్వాజ వనముజేరి
యతనిచే సత్కృతులనంది యందునిలచి
మరుదినమున చిత్రకూటాద్రి కరుగనెంచి
పయనమైపోయిరి మునీంద్రు వనముదాటి 118

ఉ॥ వారటు బోయిపోయి మునివర్యుల సేవలందుచున్ సదా
హారముగాగ లభ్యమగు నాకులు పండ్లును కందమూలములన్
సారమతిన్ గ్రహించుచు ప్రశస్తతరంబగు చిత్రకూటమున్
జేరి మునీంద్రులున్ బొగడ శిష్టతగట్టిరి పర్ణశాలయున్. 119

కం॥ అందు వసించుచు సన్ముని
బృందమ్ములగలసి వారి వివిధ చరిత్రల్
డెందములలరగ వినుచున్
బృందారకసముడు సుకృతి వెలయుచు నుండన్ 120

కం॥ ఒకనాడు జానకీసతి
సుఖముగ నిద్రించువేళ పొద్యముగాగన్
ఒక కాకి వచ్చి కుచమును
ముకుపుటమున రక్తమొలుక పొడిచిన యంతన్ 121

గీ॥ రాముడొక గడ్డిపోచ మంత్రించునపైవ
గదు భయంకరరూపమై కాకివెంట
తరుముకొనిపోవ నదివచ్చి దశరథసుతు
చరణముల వ్రాల దానిపై జాలిబూని 122

కం॥ నాయస్త్రమెన్న రిత్తగ
బోయెడునది కాదుగాన పొలుపుగ నీయం
దేయదియొ నొక్కయంగము
నీయగవలెనన్న నేత్రమిచ్చెను భక్తిన్ 123

చ॥ ఇది యిటులుండ నాదశరథేశుని దత్తరుణీ ద్వయంబు స
త్సదనమునందు చేర్చుకొని సప్తదినంబులు కాచియుండ దా
నెదబరి తాపమొంది కడకేమియు బల్కకయున్న జూచి నె
మ్మదిగను నిద్రబోయెనని మానినులున్ని దురించిరందరున్ 124

గీ॥ వేకువనులేచి ప్రాణేశు విధమునుజూడ
నసువులున్నట్లుగా దోచదాయెననుచు
నందరును బోరుమని యేడ్వనరసివచ్చి
మంత్రులందరు దుఃఖనిమగ్నులైరి. 125

గీ॥ గురుడు వారలనందరి నరసిదుఃఖ
పరవశమ్మున నిట్లుండ పాడిగాదు
జరుగవలసిన కర్తవ్య మరయవలయు
నంచు యోచించి గురువర్యు డనియెనిట్లు, 126

గీ॥ రామచంద్రుని పిలచిన రాడుగాన
మామగారింటికేగిన మాన్యమతుల
భరతశత్రుఘ్నులను పిల్వబంపవలయు
నని తెలియబల్కి యొక్క బ్రాహ్మణుని బంచి 127

గీ॥ భరత శత్రుఘ్నులను నీవు త్వరితముగను
బోయి తోడ్కొని రావలె భూసురేంద్ర
యీ విషయమేమి తెలుపక యిపుడు నేను
పిలిచితి నటంచు జెప్పి రప్పించు మటకు. 128

కం॥ అని పనిచిన నాతడు చని
జని వారిని గాంచి మిమ్ము సత్వరమున ర
మ్మని గురుడు చెప్పినాడని
వినయమ్మున దెలుప వారు విస్మయమతులై. 129

గీ॥ అన్నదమ్ములిద్దరు మామనరసి మమ్ము
త్వరగ దోడ్కొని రమ్మని గురుడు విప్రు
బంపినాడని యానతివడసి పురికి
పయనమై వచ్చి రెంతయు త్వరితగతిని. 130

గీ॥ భరతుడాతురమున తల్లి వద్ద జేరి
రామునకు సేమమే మమ్ము రమ్మటంచు
పిలువనంపుట యేమిదో తెలియజేయు
మని వచింపగ గైకేయి యనియె నిట్లు 131

మ॥ తనయా నీవిటనుండకుండ నటులన్ దాబంపి మీ తండ్రి రా
మునకున్ బట్టముగట్టబూనెడు తలంపున్ నేను గుర్తించి ము
న్ననువారంగ నొసంగనౌ వరములే నర్థించి పట్టంబు నీ
కెనయన్ రాము నరణ్యభూములకు నంపించంగ సాధించితిన్. 132

ఉ॥ రాముడు సీత లక్ష్మణుడరణ్యనివాసము జేయబోయి రిం
కేమియు మారుబల్క యెదిరించెడి వారికలేరు గాన నీ
కేమి కొఱంతయుండదు మహీశుడు ప్రాణమువీడె నీవు సు
త్రాముని రీతి రాజ్యమును ధన్యత నేలుమటంచు దెల్పినన్. 133

గీ॥ భరతుడంతయు విని దుఃఖపరవశుడయి
రామ రామయనుచు నేలవ్రాలి లేచి
ఛీ కలుషచిత్త నీవెంత చెనటివైతి
నక్కటా యేమిగతియని యడలుచుండ 134

గీ॥ పురజనులు వచ్చి మంథరబోధ వలన
యింతపని యయ్యెనని తెల్ప స్వాంతమందు
కనలి శత్రుఘ్నుడామెను కాలదన్ని
గిరగిర ద్రిప్పి పడగొట్టె క్షితితలమున 135

కం॥ వడివడి గైకేయిం గని
వధియించెదనంచుబోవ భరతుండంతన్
యిదితగునె పాతకంబని
మదివలదనె యనుజయించు మరలించి వెసన్ 136

గీ॥ పరితపించుచు గౌసల్య పజ్జజేరి
పాదములపైన వ్రాలిన భరతుజూచి
యేలుకొనుమన్న రాజ్యమిం కెదురులేక
యనుచు కన్నీరునించిన యమ్మనరసి 137

కం॥ తల్లీ నాకిప్పటికే
యుల్లంబెంతయును కుళ్ళియున్నది మదినీ
యుల్లమున నిటుల దలచిన
కల్లలుగాదింక తండ్రిగలతు ననంగన్ 138

కం॥ అంతట నామెయు నీగుణ
వంతుని వెక్కసములైన పలుకులతోడన్
స్వాంతము నలయించితినని
యెంతయు శాంతమున గౌగిలించి యిటులనియెన్ 139

కం॥ నా తండ్రీ దుఃఖితనై
యీతెరగున నంటిగాని యెరుగనె నిన్నున్
ఘాతుకమతి కైకాసతి
చేతల కింతయ్యెననుచు జెప్పుచు నుండన్. 140

గీ॥ గురుడు చనుదెంచి వారినందరిని రాజు
కడకు జేర్చిన బాంధవుల్ కదిసివచ్చి
దహన సంస్కారములను సద్ధర్మనిరతి
దనరజేసిరి శోకసంతప్తులగుచు. 141

గీ॥ వరుస పండ్రెండు దినములవరకు తగిన
రీతి పిండప్రదానాది క్రియలొనర్చి
బ్రాహ్మణులకు పితృప్రీతి పావనముగ
దానములొసంగి విశ్రాంతి దనరినంత 142

ఆ॥ వె॥ రాజ్యమేలునట్టి రాజులేకుండిన
వైరులరసివచ్చి పైకొనెదరు
జనులు నీతిదప్పి చరియించెదరటంచు
భరతు బిలిచి గురుడు పలికెనిట్లు. 143

కం॥ నరపాలుడు గతియించెను
ధరణీ పరిపాలనంబు ధరియించటకున్
బరికింపగ నీకేతగు
మరియెవ్వరు లేరు తండ్రిమాటయు నిలుచున్. 144

చ॥ అని వచియించినంత మహితాత్మ గురూత్తమ యెంతమాట యా
ఘనుడగు రామచంద్రుడటు కానలనుండగ రాజ్యభోగముల్
అనుభవమొందగోరు కలుషాత్ముడగాను ధరిత్రి గైకకే
దనయుడనై జనించుటయె తప్పుగనిట్లు దలంపజెల్లునే 145

కం॥ వనముల నెచ్చట నుండిన
వినయమ్మున నగ్రజన్ము బిలుచుక వత్తున్
జనుదెంచకున్న నేనున్
మునినై యాస్వామి వెంటమునివనమున బోదున్. 146

కం॥ అని భరతుండు వచించిన
తనమది యుదిమంచిదంచు దలచి గురుం డ
వ్వనితలతో మనముందరు
వనముల కేగుదమటందు పయనము జేసెన్. 147

కం॥ కొందరు రథములపై మరి
కొందరు నేనుగులపైన గుఱ్ఱములపయిన్
గొందరు మరి కాల్నడకను
కొందరుజన గుహుడుగాంచి క్రోధోన్నతుడై. 148

శా॥ ఔరా యెంతటి రాజులైన తగునే యన్యాయముల్ సేయగా
శ్రీరామున్ బదునాలుగేండ్ల దవికిన్ జేటొప్పటుగాబంచి దు
ర్వార ప్రోద్ధత తోరవచ్చితివి నీపాపెంతయో జూచెదన్
రారమ్మంచనదల్ప శాంతముగ రామానుజుం డిట్లనెన్ 149

ఉ॥ ఓమహితాత్మ పావన గుహోన్నతు నగ్రజు రాజుజేయగా
నామదిబూని యీగతి వనంబులనారయ వచ్చినార మా
స్వామిని మాకుజూపు గురుభావయటన్న శమించి యాతడున్
బ్రేమ సమాదరించి వనవీథులమార్గము జూపెజెచ్చెరన్. 150

కం॥ వారందరు పయనంబై
భారద్వాజాశ్రమంబు పజ్జంజేరన్
సాహోదారత నమ్ముని
వారల నాశీర్వదించి వైభవ మెసగన్. 151

గీ॥ మహితమైన తపోమహిమంబు వలన
సౌధములు నాసనంబులు సకలవస్తు
సమితి నిర్మింప నందరు సంతసించి
యచట విడిసిరి యమ్మౌని యాదరింప. 152

కం॥ ఉన్నతమగు సింహాసన
మెన్నగ శ్రీరాముని దని హితమతి భరతుం
డన్నగరున పీఠముపై
పన్నుగ నాసీనుడయ్యె భవ్యస్ఫూర్తిన్. 153

ఉ॥ ఆదినమంది సేమమని యచ్చటనుండి ప్రయాణమైచనన్
మోదముమీరగా విపినభూమి వినోదములెల్ల జూచుచున్
ఆదెస చిత్రకూటగిరి నారసి యమ్మహితాద్రియందె నీ
తాధవు వర్షకాలగలవంచు మునీంద్రులు తెల్పినంతటన్. 154

గీ॥ భరతుడెంతయు సంతోషభరితుడగుచు
నచట పరివారమంతయు నాపి గురుని
అమ్మగారిని దోడ్కొని రమ్మటంచు
చెప్పి ముమ్ముందుగా దానుచేరవలచి 155

గీ॥ గురువరుండంత యోచించి భరతుజూచి
రాముని మనంబు నొప్పింపరాదు గాన
తండ్రి యానతి మీయన్న తనరజేయ
నీవు మీయన్న యానతి నెరపవలదె? 162

కం॥ ఇది మంచిదనగ రాముని
పదములగని స్వామినీదు పాదుకలు సభా
సదనాసనమున నిడుకొని
ముదమున బట్టంబుగట్టి మునినై యుదున్ 163

గీ॥ ఇంతమాత్రమునకు సమ్మతింపుమనుచు
వినయమున బల్క రాముడు ప్రియము మీర
పాదుకలొసంగి నంతట బరమభక్తి
శిరముపైదాల్చి పయనించె సెలవుబొంది 164

గీ॥ అటుల బయనించి సన్ముని యాశ్రమములు
గడచి గంగానదిందాటి కదలివచ్చి
నగరునంజేరి సింహాసనంబునందు
పాదుకలనుంచి పూజించె భక్తిమీర 165

కం॥ భేరీమృదంగముఖ వా
ద్యారావమ్ములు సెలంగ నాపాదుకలన్
శ్రీరామునిగా శిష్టా
చారత బట్టంబుగట్టె సంతసమెసగన్ 166

కం॥ అని యిటు రెండవభాగ
మ్మను రాక్షస మాఘమాసమున సితతదియన్
అనువైనరీతి మోద
మ్మున రాస్త్రాడోబిరెడ్డి మునియన్ జేసెన్. 167

## ఖడ్గబంధ కందము

కం॥ దీనావనా జనార్దన
నేననునయ నవ్య గతుల నిన్నెంతు సదా
దానవహర నన్నేలవె
జ్ఞానఘనశో భవ్యగతుల సామజవరదా

| వ | | నే | శో భ వ్య గ తు ల సా మ జ వ ర
దీ నా ర్ద న | య న వ్య గ తు ల ని న్నె ం తు స > దా
| జ | | ను | న జ్ఞా వె ల న్నే న ర హ వ న

## —: తృతీయ భాగము :—

కం॥ శ్రీసీతారమణీ రమ
ణా సామజభీతిహరణ నయగుణశరణా
వాసవ సన్నుతచరణా
కౌసల్యానందకరణ కరుణా భరణా.

ఆ॥వె॥ పాదుకాభిషేక పర్యంతము ద్వితీయ
భాగముగ ధరిత్రి బరగజేసి
అదియు మొదలుగాగ ననువారగ దృతీయ
భాగమేనొనర్తు బరమనిష్ట

గీ॥ ఇచట వసియింప బురజనులెల్లవేళ
వచ్చుచుండెదరని యెంచి భవ్యమతులు
దండకారణ్యమునకేగ దగునటంచు
మరుదినంబె ప్రయాణమై తరలి చనిరి.

గీ॥ ఇట్లు పనుచుండ నత్రి మునీశ్వరుండు
సమ్మదమ్మున వారిని సత్కరింప
సతని యర్ధాంగి యనసూయ అవనిజాత
సరసి యెంతయు సంప్రీతి ననియెనిట్లు. 4

కం॥ అమ్మా నీ పరిణయకథ
యిమ్ముగ నే వినదలంతు నెఱిగింపుమనన్
అమ్మహిళామణి సర్వము
సమ్మతి వినుపించె వారు సంతస మొందన్ 5

కం॥ మరుదిన మచ్చటి నుండియు
వెరవున పయనించి విపినవీథుల గనుచున్
గరమార దండకాటవి
స్థిరతర సుస్వాంతులగుచు జేరినయంతన్. 6

కం॥ మునులనుగని వారల దీ
వనలను గొనుచును చరించి పదివత్సరముల్
చనినంత సవ్వనమ్మున
ననువగు పోటరసి యందునాగిన వారై 7

ఉ॥ అక్కడ వాస్తుపద్ధతిని యాకులు గడ్డలు గూర్చి యెంతయున్
జక్కని పర్ణశాల సువిశాలతరంబుగ గట్టి యందు స
మ్యక్కరుణాంతరంగులగు మౌనులతోడ వసించియుండగా
రక్కసు లచ్చటన్ మునుల రాయిడి బెట్టుచునుండి రెప్పుడున్. 8

ఉ॥ అంతట రామచంద్రు డసురాళిని ద్రుంచుచు మౌనులార ని
శ్చింతగ మీతపంబులను జేయుడటం చభయం బొసంగగా
కాంతుని జూచిసీత ప్రమదమ్మున నోహృదయేశ దైత్యులన్
పంతము బూనిచంప గడుపాతకమంచు మదిందలంపవే. 9

కం॥ మునివృత్తియాని వచ్చియు
దనుజుల జంపంగ మనకు ధర్మంబగునే
మనకేల యిట్లు మౌనుల
పనికై పాతకముజేయ పనిగొనియెదవే. 10

కం॥ అని యిటు వచియించిన యా
జనకజనుం గాంచి ప్రాణపతి నీ పలుకుల్
గనుగొన బ్రాహ్మణ ధర్మము
మనధర్మము దుర్మతులను మర్దించుటయే. 11

కం॥ అని తెలియబల్కినది యావన
మునిని మూపు నెలల్వసించి మునుకొని మునులన్
గనుగొనుచు నచ్చటచ్చట
ఘనముగ మూడేసి నెలలు గడుపుచునుండన్. 12

గీ॥ లక్ష్మణుడు కందమూల ఫలములకొఱకు
పోయియున్నప్పుడొకచోట పొదనుజూచి
యందు ఖడ్గంబొకటియుండ నరసిదాని
తెగువగననెంచి యాపొద ద్రెంచినంత 13

కం॥ అక్కడ దపమొనరించెడి
రక్కసుడు గతించినంత లక్ష్మణుడయ్యో
యిక్కరణి మునిజంపితి
నక్కట యింకెట్టులనుచు నన్నకు దెలుపన్. 14

ఉ॥ ఇందుల కేమి దోచకిటు లిద్దరు జింతిలుచుండ మౌనిసం
క్రందనుడంతవచ్చి వివరంబుగ దెల్పుచు మంచిదయ్యె మీ
రెందులకింత చింతగొన నింద్రునిగూర్చి తపంబొనర్చి మ
మ్మందరి నేచునట్టి దురితాత్ముడు వాడసురుండు రాఘవా. 15

ఆ॥ వె॥ జిష్ణుచతనికిడిన శితఖడ్గమదియంచు
తెలియజేయు మదిని దిగులుమాని
మునులదీవనలను గొనుచు సమ్మోదంబు
మీర సౌఖ్యగతుల మెలగుచుండె. 16

కం॥ వనమున మరణించిన తన
తనయునిగని యార్భటమున దర్శించుచు
య్యనవచ్చి శూర్పణఖ రా
ముని గనుగొని యమితమోహమును బొందినదై 17

ఉ॥ రాముని జేరబోయె సుకరంబగు రూపముదాల్చి యెంతయున్
నామది గాంక్షజెందితి ఘనంబుగనన్ను బరిగ్రహింపుమో
శ్యామలమూర్తియంచు సరసంబుగబల్కగ నమ్మహాత్ముడో
కామిని లక్ష్మణుండు తమకమ్మున బొందును పొమ్మటంచనన్. 18

కం॥ అది లక్ష్మణుచెంతకు స
మ్మదమున జన రామునాజ్ఞ ముక్కుం జెవులున్
మొదలంటగోసి పంపగ
నది ఖరదూషణులకడకు నరచుచు బోయెన్. 19

చ॥ అది కనినంత నయ్యసురులాగ్రహముంగొని యెవ్వడిట్లు నీ
కొదవగజేసె నాఖలుని యర్వినిగూల్తుము తెల్పుమన్న న
య్యదియనె యావనస్థలిని యున్నయదమ్ముడు నొక్కకాంతయున్
మదమునసుండి యిట్లులవమాన మొనర్చిరటంచు దెల్పుచున్. 20

గీ॥ తపముజేయుచున్న నాతనయుడైన
జంబువును దుర్మదాంధులు చంపియుండ
నరసి దుఃఖనిమగ్ననై యచటకేగ
మార్గమునగోసిరిట్లు నాముక్కుచెవులు. 21

కం॥ ఆపలుకులువిని ఖరుడును
కోపాటోపమున నైదుగురు బలయుతులన్
రూపించి పంపగా నొక
తూపున రాముండు వారిద్రుంచిన యంతన్ 22

కం॥ అది గనుగొని ఖరదూషణు
లెదరోషముజెంది యార్భటించుచు సుభటుల్
పదుగురి వెంబడి నడువగ
పదిలంబుగ యుద్ధమునకు పైకొనిరాగన్. 23

గీ॥ రాముడటుగని సీతను లక్ష్మణుండు
తోడ్కొని గుహాలయమునకు పోనగుపంచి
కుండ గాపాడగాబంచి ఖండనమున
పదునలుగురగూల్చె దేవతలు మెచ్చ. 24

కీ॥ శూర్పణఖ నిజసోదరుల్ సొరుగుచెదిరి
దిక్కుతోచక రావణు వెనకబోయి
జరిగినట్టి సంగతులెల్ల నెరుగునట్లు
వినయమునచెప్పె నన్నతో వివరముగను. 25

శా॥ అన్నా లోకమునందు నట్టిరమణీయంబైన కాంతామణిన్
మున్నెన్నండును జూడలేదు కమనీయంపున్ సొంపుజన్నారెడిన్
అన్నాతిన్ గనుగొన్న నీమది సముద్యద్దివ్యమోహంబు గా
కున్నే యెట్టులనైన దానిగొనితెమ్ముల్లాస మొప్పారగన్. 26

చ॥ అనగనె రావణుండరసి యామతినిం గొనితేర నిప్పుడే
జనియెదనంచు రౌద్రరథసంజెనగన్ బయనించుచుండ నా
వనితమరల్చి యింతసులభంబుగ నౌనని యెంచబోకు మే
యనువునసైన నెమ్మదిగ నారసి కార్యమొనర్ప నొప్పగన్. 27

కం॥ ఖరదూషణులను మరి దు
స్తర భుజ బలయుక్తులై న దనుజుల నెల్లన్
బరిమార్చి విశ్రమించెను
వెరపున గొనితెచ్చుటొప్పు వేగిరపడకన్. 28

గీ॥ సీతఁ రామునిఁ వేరుజేసి యొంట
నున్న యప్పు డెత్తుకొనిరమ్ము యువిదనిటకు
పతినిగానక రాముండు చావగలడు
చావకున్నను రాలేడు జలధి దాటి 29

కం॥ అని యెంతయు విశదంబుగ
దనసోదరి దెల్పినంత దడయక యిటకున్
జనుదెమ్మని పిలిపించెను
అనువారగ మాయగొల్ప నగు మారీచుఁ. 30

ఆ॥వె॥ వాడువచ్చి దనుజవల్లభునకు మ్రొక్కి
ఆజ్ఞయేమి తెల్పుమని వచింప
మాయలేడిగాగ మహిదండ కాటవి
సంచరింపవలయు చతురగతిని. 31

గీ॥ మనుజులిద్దరు నక్కడ మగువతో వ
సించుచున్నారు నీవందు సంచరించి
సతినివిడచి దూరము వారు చనెడునట్లు
నీదు చాతుర్యమచ్చట నెరపవలయు. 32

కం॥ అనిపలికిన మారీచుడు
ఘనబలు లటనున్నవారు కనుగొన్నాడన్
మనుజులుగా గణియింపకు
మని యెంతయు దెలియజేసు నాగ్రహమతియై. 33

9 )

కం॥ చెలియలి ముక్కుం జెవులును
తులువతనమ్మునను గ్రుంచి దోర్గర్వమునన్
జెలరేగుచున్నవారిని
యిల గూల్చక యూరకున్న నెల్లరు నగరే. 34

శా॥ ఏమాత్రంబును శాంతిబొందనికనే నీమాట లింకేల యీ
నేమంబున్ విడి నేనటుంగుదుమగా నీకేల సందేహముల్
ప్రాముఖ్యంబుగ జేయగావలసిమే రమ్మంటి నిచ్చోటికిన్
నామాటల్ వెగటైనచో వెడలుమా నాకేల నీబోధనల్. 35

కం॥ అని కఠినంబుగ బల్కిన
తన మనమున భీతిజెంది తడయక నపుడే
చనిగొని కనకమృగంబై
చనుకొని యా పర్ణశాల ముంగిట నిలచెన్. 36

కం॥ ఆ జింక బట్టియిమ్మని
యా జానకి రామునడుగ నదిగొని తేరం
గా జనిన రామచంద్రుని
వేజూచి కురంగమోగిరి వెడలినదాయెన్. 37

ఉ॥ మాయలమారి జింక పలుమారును జిక్కినయట్టులౌచు నా
చాయను జెంగునన్ దపుడుసల్పుచు నెంతయు వింతరీతులన్
జేయుచునుండ గోపమునుజెంది శితాస్త్రమువేయ లక్ష్మణా
హా యని బిట్టుగానరచి యయ్యది ప్రాణమువీడినంతటన్, 38

కం॥ ఆ వాక్యము విని సీతా
దేవి యిదేమోయటంచు దిగులున్ మదిన్
నీవేగు మచ్చటికి యన
నీవాక్కుల కదలకుంట నిట్లనె నతమున్. 39

కం॥ తల్లీ రాక్షసమాయలె
యెల్లప్పుడు నివ్వనమున నెరిగినవెగదా
ఉల్లమున భీతినొందకు
చల్లగ మాయన్న యిటకు చనుదెంచుననన్. 4

గీ॥ అంత జానకి దుఃఖితస్వాంతయగుచు
మఱది నెంతయు ననరాని మాటలాడి
మనసు నొప్పింప సంతాపమున నతండు
యేడుగీత లచ్చటగీసి యిట్టులనియె. 4

గీ॥ తల్లి యీ యేడు గీతలు దాటి యిచటి
కెవడువచ్చినొ వాడు మహీతలమున
తలబగిలిచచ్చు నీమాట తథ్యమగు న
టంచు జనియెను లక్ష్మణు డన్నకడకు. 42

చ॥ ఇది సమయంబటంచు దనుజేంద్రుడు జంగమువేషమూని స
మ్మదమున బర్ణశాలకడ ముంగిట నిల్చి నమశ్శివాయ ఓం
మదన హరాయయంచు బలుమారును గంటను మ్రోయజేయగా
ముదిత మహానుభావుడని ముందరిగీతలు దాటి యిట్లనెన్. 43

దిః॥ స్వామి నాపతి జింకను బట్టబోయి
చాలా తడవైన మఱది నాజాడనరయ
నంపితిని యింతలో వత్తురయ్య యిందు
నధి వసింపుడటన్న నా యసురు డరసి. 44

మ॥ కనకాంగీ యిటు భీకరాటవుల బల్ కాఠిన్య మార్గంబులన్
అనయంబున్ మది గుందనేల విను లంకాధీశుడ న్నేను రా
వణుడన్ నన్ను వరింపు మెంతయును సౌభాగ్యంబుగా నిత్య పా
వన సౌఖ్యంబుల నొందగాగలవు నా వాక్యంబు లాలింపుమా. 45

గీ॥ అనగ నెంతయు ధీతిల్లి హా యటంచు
వసుధ మూర్ఛిల్ల నామెనుబట్టి గగన
యానమునజేర్చి లంకకు నరుగునట్టి
సమయమందు జటాయు వచ్చటికి వచ్చి.

శా॥ ఓరీ రావణ దుర్మదాంధ యిటులీ యుర్వీజ సాధ్వీమణిన్
జోరత్వంబున బట్టితెచ్చితివి సంస్తుత్య ప్రభావాఢ్యు డౌ
శ్రీరాముం డెవడంచు నెంచితిని నీ జెండాడకన్ మాన దు
ర్వారప్రోద్ధతి నొక్క తాకున తలన్ వ్రాలింతు ధాత్రీస్థలిన్.

కం॥ అని శిరములు భుజములు తొ
మ్మను రక్తమయంబుగాగ బొడిచిన నతడున్
ఘనతరమగు దివ్యాస్త్రము
లను బరచిన దునిమవైచె లక్ష్యము గొనకన్.

గీ॥ దానవుడు వేయు బాణముల్ తగులకుండ
నడుమనే త్రుంచుచుండిన కడిమినతడు
ఖడ్గమును బూని దాని రెక్కలును రెండు
దునుమ రామాయనుచు పక్షి తూలిపడియె

ఆ॥ వె॥ దాని నేలగూల్చి దైత్యుండు జనుచుండ
ముదిత యచ్చటచ్చట ముఖ్యమైన
భూషణములు దారి మూటవైచి గుడ్డలో
విడచి వైచుచుండె బుడమి బడగ

గీ॥ అట్టిసొమ్ములు ఋష్యమూకాచలమున
బడిన గని వానరులు గాంచి భద్రపరచి
రావణునిచేత జిక్కిన రమణి యెవరో
గురుతుగా వైచెనని యనుకొనుచునుండ.

గీ॥ రావణుం డామెఁగొనిపోయి లంకఁజేర్చి
తన విభవమంత యుంజూపి తరుణి వీని
కంతటికి నీవె యధికర్త వగుదువింత
ననుభవింపుము సకల సౌఖ్యంబులనగ. 52

ఆ॥వె॥ దోషహచిత్త యిల్లు దొంగవేషము బూని
పట్టి తెచ్చినాడు పారిపోక
నీప్డు నీదుకులము నీ రాజ్య విభవంబు
లెల్ల బూర్తిగా నశింపకున్నె. 53

కం॥ అని నిష్ఠురోక్తులాడిన
దనుజు డశోకవనమందు ధరణిజ నిడి దు
ర్వనితల త్రిజటాదుల నటు
యనువుగ బోధింపుమంచుఁ దని నియమించెన్. 54

ఉ॥ అక్కడ లక్ష్మణుండును రయమ్మున నగ్రజుచెంతకేగ నీ
విక్కడి కేలవచ్చితివి యెంతటిమూర్ఖము దండకాటవిన్
రక్కసు లెల్లకాలమును రాయిడిపెట్టుట నీవెరుంగవే
అక్కట యాయతాక్షి కట నాపదలొందగ నేమొనర్చిరో. 55

కం॥ అని త్వరగ నన్నదమ్ములు
మనమున దానవులభీతి మల్లడిగొనగా
చనుదెంచి పర్ణశాలను
కనుగొనగా సీత యందు కనబడదయ్యెన్. 56

గీ॥ అక్కటా యని శ్రీరాము డవనివ్రాలి
యెంతమోసము వాటిల్లె నింక యేది
మార్గమని వారు దుఃఖ నిమగ్నులగుచు
వెదకసాగి రున్మాదుల విధమువోవ. 57

ఆ॥వె॥ తిరిగితిరిగి వారు దిక్కుదోచక దక్షి
ణాభిముఖముగాగ నరుగుచుండ
నొక్కచోట మిగుల నున్నతంబై యొప్పు
పక్షి నేలమీద వ్రాలియుండ. 58

గీ॥ రామచంద్రుడు దానిని రాక్షసునిగ
దలచి తమ్ముడ చూచితే దానవుండు
జానకిని మ్రింగి యొప్పుకోజాల కిట్లు
మనయెదుట వ్రాలియున్నాడు మాయగొల్పి. 59

కం॥ అని కోపమ్మున దానిని
దునుమను ధనువున శరంబు దొడిగినయంతన్.
ఇనుకులతిలకా మీ నా
యన మిత్రుడ నను జటాయువందురు ధాత్రిన్. 60

కం॥ మున్నిజన సన్నిహితుడనై
వనమున విహరింతు గశ్యపబ్రహ్మకు నే
మనుమడను సీతగుని చను
దనుజునితో బోరియిట్లు ధాత్రిం దడితిన్. 61

కం॥ అని యంతయు వినుపించిన
అనఘా మాకొరకు నిట్లు లవనిన్ బడితే
అని దాని నిమురుచును నీ
కనువుగ మోక్షంబుజెంద నగుగాక యనెన్. 62

ఆ॥వె॥ ఇట్లు మోక్షమిచ్చి హితముతో దహనాది
క్రియలుదీర్చి వారు బయలుదేరి
పక్షి జెప్పినట్టి పథమున జనుచుండ
నొక్కచోటగాంచి రుగ్రదేహు. 63

చ॥ కడుపుననోరు వక్షమున గన్నులు నామడచేతులొప్పగా
నడవిని బోవువారల రయమ్మున ద్రుంగుచు జంతుజాలముల్
పడకగ నార్భటించెడి కబంధుని వానిబట్టి యాద్వగా
తడయక బాహువుల్ నరికి ధాత్రినిగూల్చిరి రామలక్ష్మణుల్. 64

ఉ॥ ధారుణి వారిచేబడిన తక్షణమే యతడా భయంకరా
కారము మాని దివ్యమగు కాయముతో రఘురాముగాంచి యో
సారచరిత్ర నాకు ముని శాపవశమ్మున నిట్టి భీకరా
కారముగల్గె మీవలన గాంచితి నాదగు దివ్యరూపమున్. 65

గీ॥ నేను దనుడ నజుంగూర్చి నిష్ఠతోడ
దపమొనర్చి దీర్ఘాయువు దర్పమొంది
మునుల బాధింపగా నొక్క మునివరుండు
కనలి శపియింప నీరూపు గనగనయ్యె. 66

గీ॥ తప్పు క్షమియించుమంచు పాదములవ్రాలి
మునిని ప్రార్థింప నాతండు కనికరించి
శాపము దొలంగి శ్రీరామచంద్రునివలన
పూర్వరూపము గలుగును పొమ్మటనిచె. 67

కం॥ అని తనగతి రావణుగతి
వినుపించి యతండు వారి వీడ్కొని చనిన్
అనువార మతంగాశ్రమ
మున కరిగిరి తగిన మార్గముల గనుగొనుచున్. 68

గీ॥ ఆ మునీశ్వరు శిష్యురాలైన శబరి
స్వాము లిటువచ్చిరని మది సంతసించి
కోరి రుచిరమైనఫలములు కొఱికిచూచి
తెచ్చి సద్భక్తి నర్పించె దినుడటంచు. 69

గీ॥ ఆమె సద్భక్తికెంతయు నాత్మమెచ్చి
ఆదరమ్మున పండ్లు వారారగించి
ఆదినంబుండి మరునాడు పోదలంప
వినయమున నామె వారితో ననియె నిట్లు.

ఆ॥ వె॥ రావణుని వధింప రామచంద్రుడె చాలు
గాని కొంతమాత్రమైన సేవ
కలిగియుండవలయు సుగ్రీవు
మైత్రి గొనుడటన్న మహాతపసి.

కం॥ సుగ్రీవుడెవడు వానర
నిగ్రహుడై మాకు హితము నెరపుటకై
ఆగ్రహ వరోద్ధతి న
త్యుగ్రము గారణమెనర్ప నోపునె యనగన్.

గీ॥ వాలిసుగ్రీవు లనిమెడ వానరేంద్రు
లన్నదమ్ములు ఋష్యమూకాద్రి చెంత
బరగు కిష్కింధ యనునట్టి పురవరమున
పాలన మొనర్చుచుండిరి పావనముగ.

కం॥ సురలసురులు పీరబ్ధిని
దీరచిన నమృతాదులు మరితారయు గలుగన్
గరళము శివుడు ధరించెను
వరకరి నప్సరసలను దివస్పతి గోనియెన్.

వరుస నమరులు నమృబంచుకొనిరి
శంఖమును మురిలక్ష్మిని చక్రిగొనియె
వాహనంబులు నష్టదిక్పతులు గొనిరి
వీరికానగరి తారను విబుధవరులు

కం॥ తారాసతీయుతంబుగ
వీరలు కిష్కింధఁజేరి వేడుక గపులన్
ధారుణి బరిపాలించిరి
సారోదారాత్ములగుచు శశ్వత్కీర్తిన్. 76

గీ॥ కొంతకాలమునకు రుమా కాంతయును సు
షేణు సుతనుస్సుగ్రీవుండు శిష్టనియతి
బరిణయంబాడి దివ్యవైభవముతోడ
సన్నుయానతిమీరక నలరుచుండ. 77

కం॥ మునుకొని దుందుభియనియెడి
దనుజుడు యుద్ధంబుసేయ దలపునరాగన్
గనివాలి వానినుగ్రత
దునిమె నిరాయాసముగను దోర్బల మెసగన్. 78

చ॥ పదపడి యాకళేబరముబట్టి బలోద్ధతి ద్రిప్పివైవగా
నదియొక యోజనంబునకు నవ్వలవ్రాలిన దానిరక్తమున్
ముదుసలియౌ మతంగముని మూర్ధముననబడ యాగిరిస్థలిన్
పదమిడెనేని వాలితల వ్రక్కలుగాగ శపించె నుగ్రుడై. 79

గీ॥ అది మొదలుగాగ నాగిరియందు వాలి
అడుగుబెట్టడు పౌరజాబునై నగాని
మిగుల జాగ్రత్తతో నిట్లు మెలగుచుండ
తండ్రి పగదీర్ప మాయావి తలపుబూని. 80

కం॥ దుందుభిసుతుడౌ దనుజుం
డందు ప్రవేశించి భీకరార్భటిం జేయున్
కొందల మొందక వారత
నిం దదుముకపోవ భీతినిన్ గుహమూసెన్. 81

గీ॥ వాని వెన్నాడి చంపక వాలియపుడు
తరుముకొనిపోయి వాకిట తమ్మునుంచి
వత్సరము వానితోఁబోరి వసుధగూల్చి
వాలికీర్తిగ నడచెను వాడణచ్చె. 82

గీ॥ ఆసురవునిని సుగ్రీవు డక్కటకట
అన్న మరణించెనని యెంచి యసురుడింక
రాకయుండుటకట గుండు నాకివైచి
పురమునకువచ్చి యెంతయు బొగులుచుండె. 83

కం॥ ఆకొండ గుహాలయమున
పొక్కట బలశాలియైన వానరపతి పెం
జీకటి త్రోవగానక
వాకిట గుండుండుటరసి పదమున దన్నెన్. 84

కం॥ తమ్మునిపై నెంతయును
గ్రమ్మిన జనుదెంచి ఘోరరణ మొనరింపన్
తమ్ముడు తనసైన్యముతో
ఋష్యమూక పర్వతముజేరె నెంతయు భీతిన్. 85

గీ॥ అన్నయగు వాలి శత్రువై యతని సతిని
రాజ్యమున్నాక్రమించిన రక్షయైన
కొండపైనుండు వానరకోటి యెనగ
నతనిమైత్రిని నడిపిన సగుణజనంబు 86

కం॥ సూర్యకులపతులు మీరును
సూర్యసుతుం డతడుగాన సులభముగా మీ
కార్యము నెరవేర్చును బల
శౌర్య ప్రాభవయుతుండు వసుధ నెవ్వడకున్. 87

కం॥ అని తెలియబలికి మరియా
వనజాయతనేత్ర మోక్షపదవిన్ గోరన్
అనుమతినిడి పదపడి యా
ఘనగిరికి ప్రయాణమైరి కౌతుకమెసగన్. 88

ఉ॥ ఆగిరి చెంతకేగ ప్లవగాధిపుడారసి వీరలెవ్వరో
వేగరులై మునీంద్రులటు వేషముతో జనుదెంచియుందు రే
లాగునైనగాని వివరముగ నారయుడంచు బల్కెనన్ వదలవా వెను
ఈగతి విల్లునమ్ములు ధరించినవారలు వాలిపంపునన్
వేగరులై యతీశ్వరుల వేషముతో జనుదెంచియుందురే
లాగుగనైనగాని వివరమ్ముగ నారయుడంచు బల్కెనన్. 89

మ॥ హనుమంతుడు కపీశ్వరుంగని మహాత్మా యిట్లు శంకింపగా
జనునే యాముఖలక్షణంబులు గనన్ సద్రూపులై తోచెడిన్
వినయస్ఫూర్తిన్ నారివర్తనములన్ వేడ్కన్ బరీక్షింపగా
జనెదన్ బంపుమటంచు నాతని యనుజ్ఞలబొంది కార్యార్థియై. 90

గీ॥ మెల్ల మెల్లన జనుదెంచి మిహిరకులుల
కంజలి ఘటించి మహిలాత్ములైన మీర
లెవ్వరీరీతి నిచ్చటి కేగుదేర
కారణంబేమియొ నెరుంగ గాంక్షగల్గె. 91

కం॥ అని ఫలములు కానుకగా
ననఘాత్మునకిచ్చి నేను హనుమంతున్
వనచరనాథుని మంత్రిని
అనుపగ మీ సేవకుండనై వర్తింతున్. 92

కం॥ అని తన చరితంబంతయు
వినుపించిన రాఘవుండు విస్మయ మతియై
వనచరుల కింతప్రజ్ఞయు
వినయ వివేకములు శాస్త్రనిధులుం గలవే 93

చ॥ అని మదిసంతసించి పరమాదరణ హనుమంతుజూచి యో
వనచర మేమయోధ్య నరపాలురమంచు సవిస్తరంబుగా
దనవిధమంతయుం దెలుప ధన్యుడవంచు నమస్కరించి యా
జనపతికిజ గపీశునకు సఖ్యము గూర్చె మహాప్రవీణత. 94

గీ॥ అంత సుగ్రీవు డారాముదాపిలించి
సీత విడచిన సొమ్ములు చేతికివ్వ
నమ్మహాత్ముడు ప్రాణకాంతా యటంచు
అమితశోక నిమగ్నుడై యవని వ్రాలె. 95

చ॥ పదపడిలేచి యోప్లవగవల్లభ యాదురితాత్మగాంచనా
విధమదియెద్దితెల్పు పృథివీస్థలి వానినడంచి జానకిజ
ముదమొదవంగ దెత్తునని ఘూపతి రోషమెల్పడ బల్కనె
మ్మదిగ బ్లవంగవల్లభుడు మానవనాథునితోడ నిట్లనెన్. 96

కం॥ స్వామీ మేమాదనుజుని
ధామంబు నెరుంగమింత త్వరపడనేలా
యేమాడ్కినైన మిక్కిలి
ధీమతులగు కపులబంచి తెలుపగజేతుజ. 97

కం॥ అని సుగ్రీవుడు బల్కిన
అనఘా నీ మైత్రివల్ల ననుకూలముగా
పనినెరవేరు నటంచును
మనమున దలచితిని శంకమానగనయ్యెజ. 98

కం॥ నిను దారదోలి రాజ్యం
బనుభవమొనరించుకొన్న యావాలిని నే
డునిమెద గపిరాజ్యము నీ
కొనరించెద వానరేంద్ర యుడుగుము చింతన్.

చ॥ అని వచియింప వాలినెవరైన నెదుర్కొని చంపబూన నా
తని బలశక్తిలో నగము తప్పక వాలికి జెందగా వర
మ్మును గొనినాడటన్న వెరపుంగని చాటున నుండియే శర
మ్మున సంధియింతునప్పటికిబొమ్ము రణంబొనరింప ధీరత

చ॥ అనియిటు రామచంద్రుడతి హర్షమునన్ వచియింప నెం
మనము ధైర్యమూని కపినాయకుడుద్దతిబోయి వాలితో
రణమొనరించుచుండ రఘురాముడు బాణమువేయడాయె
వ్వనచరపాలు డెవ్వడగు వాలియెవండని దిక్కుతోచకన్

గీ॥ వాలి సుగ్రీవు లొక్కరూపమునునుండ
శరము సంధింపదోచక జనవిభుండు
సంశయించుచునుండగ సత్వరమున
తిరిగివచ్చె సుగ్రీవుండు దిక్కుదప్పి.

కం॥ స్వామీ నన్నిటు బంపియు
నీమాడ్కిని యూరకుంటి వేమందు నికన్
నీమాటనమ్మి నెంతయు
గోమలదేహంబు నొచ్చుకొనగా నయ్యెన్.

కం॥ అని పల్కిన మియిద్దరి
కెనసెడి రూపంబు లొక్కటియే యైయుండన్
గననైతి నిపుడు హారము
గొని యుద్ధమొనర్పబొమ్ము కూల్చెద నతనిన్.

కం॥ అని గుర్తుగ నొకహారం
బినతనయున కిచ్చినిచి హితమతి యంతన్
మునిలిత బాణము శతమఖ
తనయునిపైపై వ నతము ధరణి గూలెన్. 105

గీ॥ వాలి నిలగూల్చి సుగ్రీవు వైభవముగ
రాజ్యపట్టాభిషిక్తుగా రహినొనర్చి
వానకాలము దాటెడువరకు ఋష్య
మూకమున వాసముండిరి పుణ్యమతులు. 106

కం॥ ప్లవగాధిపు డాపిమ్మట
నవిళరముగ దిక్కుదిక్కులందు నగల స
త్ప్లవగాధిపులను భల్లూ
కవరేణ్యుని బిలువ ముఖ్యకపులను బంపెన్. 107

గీ॥ అవని సుగ్రీవునాజ్ఞ యెటన్న మారు
పలుకరానిదిగాపున ప్లవగవరులు
కోట్లకొలది సమూహముల్ గూర్చుకొనుచు
వచ్చిచేరిరి కిష్కింధ పట్టణమున. 108

కం॥ చేరిన జాంబవదాదుల
గారవముగ సత్కరించి కొగల కార్యం
బారూఢిచెప్పి నృపుకడ
జేరి ప్లవంగాధిపుండు స్థిరతరభక్తిన్. 109

శా॥ స్వామీ వానరనాథులెల్లరను నాహ్వానంబునన్ బంప వా
రామోదమ్మున వచ్చినారు నిజసైన్యస్తోమముల్ గూడి సం
గ్రామోత్సాహులు సీతజాడనరయంగా వారినిన్ బంచెదన్
క్షేమస్ఫూర్తినెరింగి వత్తురని సుగ్రీవుండు వాక్రువ్వగన్. 110

గీ॥ అంత శ్రీరామచంద్రుండు స్వాంతమందు
సంతసమునొంది వానరసైన్యములను
గాంచి సుగ్రీవు నెంతయో ఘనుఁడటంచు
మెచ్చి దీవించె నెంతయు ముచ్చటలర. 111

కం॥ చెలువగు సుముహూర్తమ్మున
బలయుతులగు వానరులను పలు విధములుగా
నిలసరసి సీత గనుడని
నలుదిక్కుల వెదకబంపె సైన్యమ్ముగన్. 112

గీ॥ వెదకబోయెడి వారికి వెలది సొమ్ము
లొక్కటొక్కటిగ గుర్తుగ కొసగుచుండి
ముద్దుటుంగరమును దీసి ముఖ్యుడైన
ఆంజనేయునకిచ్చె సమాదరముగ. 113

గీ॥ అంత దక్షిణదిక్కుగా నరుగుచున్న
వాలిసుతు డంగదుడు జాంబవంతు డాంజ
నేయుడాదిగ కపివరుల్ నియమగతిని
వెదకుచును బోవుచుండిరి విపినములను 114

చ॥ పదపడి వారరణ్యములు పర్వతముల్ గుహలున్ని కుంజముల్
వెదకుచు బోయిపోయి యొక భీకరాకాననమందు దప్పిచే
నుదకము గానకన్ వెదుక నొక్కగుహన్ జలపక్షులుండగా
హ్రదమటనుండవచ్చునని యాసయింపగ బోయిరందరున్ 115

గీ॥ ఆగుహాంతర మెంతయు నంధకార
మయముగానుండ వెనుకకు మరలకుండ
ధైర్యమున బోవుచుండ ముందట విచిత్ర
మై విరాజిల్లు పురవరం బలరుచుండె 116

ఆ॥ వె॥ దప్పిదీర నీరుద్రావి పట్టణమెల్ల
నరయ నొక్కఁడైన నరుడు లేడు
ఒక్క మేడమీది కెక్కి చూడగ నందు
తపము జేయుచుండె తన్వియొకతె. 117

కం॥ అంతాట వారలు తల్లీ
వింతగ నీ పట్టణంబు వెలయుగనిట ని
శ్చింతగ నున్నా వెందుకు
సాంతముగా చెప్పుమమ్మ సంశయముడుగన్. 118

కం॥ శ్రీరాముని కార్యార్థము
దూరమునుండియును వచ్చి దూపనుగొని యీ
ద్వారమున దూరి యిపటికి
చేరితిమని వారిరాక జెప్పిన యంతన్. 119

కం॥ ఆ లలనామణి సంతసము
జాలింగొని తన చరిత్ర సర్వస్వంబున్
ఈలీల దెలుప దొడగెను
చాలా వినోదకరముగ సదుముల రక్తిన్. 120

గీ॥ తొల్లిమయుడను దైత్యుడు దుర్హిణు గూర్చి
తపమొనర్చి లసద్విచిత్రమగు పురము
వడసియొక హేమయనియెడి వనితగూడి
వసుధ వసియించుచుండెను వైభవముగ. 121

గీ॥ అది గనుంగొని దేవేంద్రు డలనిజంపి
హేమగొనిపోయె నాహేమకిష్టసఖిని
నేస్వయంప్రభ నజుగూర్చి యిందు తపము
జేయుచున్నానటంచు వచించినంత 122

కం॥ ఆమానినిగని వానరు
లేమార్గమునందు బయటికేగగ దగునో
మామదికి దోచదాయెను
ఈమాయదెరల్చి పనుపు మేమేగెద మనగన్. 123

గీ॥ అంత నాలతాంగి యావానరులనెల్ల
నమిత గౌరవముగ నాదరించి
కనులుమూయుడంచు ఘనతపశ్శక్తిచే
గవికి బయటనుండగా నొనర్చె. 124

కం॥ ఈవిధిని గుహను వెలువడి
యావనితను మెచ్చికొనుచు నతివినయనంబై
పోవుచు వడిగ మహేంద్ర
గావంబును జేరనైరి కపివరులెల్లన్. 125

ఉ॥ అంతట నాంజనేయుగని యంగదుడిట్లను సీతజాడ యొ
క్కింతయు గానంగలేదు సుగ్రీవునియానతి దగ్గరిల్లెయా
వంతయు మించినన్ మనల నంతరి దుర్గింపకమాన డియ్యర
ణ్యాంతరమున్ సమస్తగిరులారయునయ్యె నికెందుబోనగున్. 126

ఆ॥వె॥ మార్గమేమిగనక మసలుచు గాలంబు
గడచిపోయె నింక కపివరుండు
హతమొనర్చుగాన నచటికిబోనేల
మరల గుహనుజేరి మనుటమేలు. 127

కం॥ మనకేమియు భయముండదు
కనుగొన లేరెవ్వరేని కడునెమ్మదిగా
మనవచ్చునని వచించిన
హనుమంతుడిట్టులనియె నాతని తోడన్. 128

గీ॥ రాముకార్యంబు సాధింప నీమముగను
వచ్చి యీరీతి బిలమున జొచ్చునెడల
గుహను ఛేదింపగల శస్త్రనిహతిగల్గు
లక్ష్మణస్వామి కిదియొక లక్ష్యమగునే? 129

కం॥ ఇది సమ్మతిగాదనగా
నదనగుమార్గంబికెద్ది యనియందరు నె
మ్మదిగను మన ప్రాణంబులు
వదలగ ప్రాయోపవేశ పద్ధతి యొకటే 130

గీ॥ అని నిర్ణయించి ప్రాణము
లను వదలగ వలయునంచు లక్ష్యము హరిపై
నెనయ ఒళివంచి యూపిరి
ననువుగ బిగబట్టవలచి యుందరు నిష్ఠన్. 131

కం॥ ఇంత సులభముగ ప్రాణము
లంతములగునని తలంచి రదిసరిపడకన్
ఎంతయు చింతిలుచుండగ
సంతతి సంపాతిపక్షి చెంతకరుదెంచెన్. 132

గీ॥ వచ్చి యాకపివీరుల వనటదెలిసి
రావణుం డబ్ధికవతల లంకయందు
గలడని సవిస్తరంబుగ దెలియజేసి
తన విధంబంతయును నివ్విధమున దెలిపె. 133

మ॥ మును తమ్మింతు జటాయువున్నరియు నేమార్గంబునన్ జల్మిమై
వినువీధిన్ గడువవ్వగా నెగయుచున్ వేడ్కన్ వినోదించుచున్
జనగా సూర్యుని రశ్మిగూలితిని పక్షంబుల్ వెసన్ గాలి నా
దానుజాంబసంకటి మెత్తుగా జనక సౌఖ్యస్ఫూర్తి వ్రాలెన్ ధరన్.

గీ॥ ఇట్లు పెక్కులుగాలి నేనిలనుగూల
తనయు డాహారమునుదెచ్చి మనువుచుండి
రావణుడు సీతగొనిపోయి లంకజేర్చె
నని కుమారుడు వినుపించె సమ్మతముగ. 135

కం॥ మునివర్యు డొకడు ననుగని
అనుకంపను దివ్యదృష్టినారసి శ్రీరా
ముని వార్త వానరులచే
వినినప్పుడు గఱులువచ్చు వెరువకు మనియెన్.  136

గీ॥ ఇపుడు పెక్కులువచ్చె నేనెగిరిపోయి
సీత గనివత్తు ననిపోయి శీఘ్రగతిని
తిరిగివచ్చి సమస్తము తెలియబరచి
వెడలుడిక ప్రాణములు మీరు విడువనేల? 137

చ॥ అనవిని వాలినందనుడు నంబుధినారసి దానినెంతయున్
గనశతయోజనంబులగు గావునదాటగనోపు వారలన్
మనము గనుంగొనన్వలయు నైజబలమ్ముమన నెవ్వరెంత ద
వ్వనకు జనంగనోపుదురు పూనివచింపుడటంచు బల్కినన్. 138

సీ॥ గజుడు, గవాక్షుండు, గవయుండు చెల్పిరి
పదియు, నిర్వదియు, ముప్పదియు దాట
శరభుండు నలుబది మరిగంధమాదనుం
డేబదియోజనా లెగురుదునన,
మైందుండు ద్వివిదుండు మసలక సర్వది
డెబ్బది చెల్పిరి నిబ్బరముగ
యెనుబది తారుండు నెగురుతానని పల్క
భల్లూకపతి జాంబవంతు డనియె

చిన్ననాటి బలమ్మును జెప్పుకొన్న
నమ్మజాలరు తొంబది నెమ్మదెగను
దాటగల నిప్పుడన వాలితనయుడబ్ధి
దాటుదును వచ్చుటకు జంకుచగులు ననియె. 139

గీ॥ అంత భల్లూకపతి హనుమంతు జూచి
నీబలము నీవెరుగక నిట్టులూర
కున్నవాడవు విద్యుతై యుదయగిరిని
చరమగిరి కంజలుంజాపజాలినావు. 140

కం॥ అని యెరిగింప నహాగతి
తనయు డంగీకరించి తడయక నిపుడే
జనిమెద సీతాదేవిని
కనుగొని వచ్చెడి నటంచు కౌతుక మెసగన్. 141

గీ॥ జనకుడగు వాయుదేవుని సంస్మరించి
శ్రీరఘుస్వామి పదములు చిత్తమందు
జేర్చి యామహేంద్రాద్రి శిఖర మెక్కి
హుంకరించి లంఘించె దలోన్నతముగ. 142

ఆ॥వె॥ వాయునందనుండు వచ్చుట గనుగొని
సేదదీర్పగనెంచి చెలువుమీర
పూని పైకిలేచె మైనాకుడను గిరి
వరుడు జలధినుండి త్వరితగతిని. 143

కం॥ నా కడ్డమువచ్చెను మా
యాకారుడు రక్కసుడని యాపర్వతమున్
ఢీకొని తాకిన యామై
నాకుండిట్లని వచించె నయభయ గతులన్. 144

మునుపు గిరులకు రెక్కలు మొనసియుండ
నింద్రుడా రెక్కలెల్ల ఖండించునపుడు
నన్ను దప్పింపవలచి మీ నాయన యిటు
సాగరమునకు గొనితెచ్చి సంతరించె. 145

ఆ మేలు నేను మరువక
స్వామి నీకు శ్రమవాయ సాయమొసర్పన్
ఈమాడ్కి పైకి లేచితి
నీమది శాంతించి యిందు నిలువుమటన్నన్. 146

ఏనిపుడు స్వామి కార్యార్థ మేగువాడ
సంతసంబయ్యె విశ్రాంతి సలిపినట్లె
ఆలసింపగ రాదు నేనని వచించి
త్వరితముగనేగె యా సముద్రంబుదాటె 147

శ్రీయుతమై యలరెడి రా
మాయణము తృతీయభాగ మాయెధ నకన్
బాయని సద్భక్తిని సు
శ్రేయుత రాష్ట్రాటి ఓబిరెడ్డి రచించెన్. 148

ఈ రామాయణకథ నె
వ్వారేనియు జదువ వినిన వ్రాసిన యేనిన్
శ్రీరాము కృపను సంపద
లారోగ్య శుభంబులొంద నయ్యెడుగాకన్. 149

—)0(—

## —: చ తు ర్థ భా గ ము :—

కం॥ శ్రీమద్రఘురామ! గుణ
స్తోమ! ఘనశ్యామ! సకల దురితవిరామా!
ప్రేమాధామా! నత సు
త్రామా! లోకాభిరామ! దశరథరామా! 1

ఆ॥ వె॥ వాయునందనుండు వార్థి దాటెను దాక
నిల ద్వితీయభాగ మెలమిజేసి
అది మొదలుగాగ సమువారగ జతుర్థ
భాగమేనొనర్తు బరమనిష్ఠ. 2

మ॥ హనుమంతుం డొక పిల్ల కాల్వగతి నయ్యంభోధి లంఘించి చ
య్యన నామందట దుర్గమంబగు సువేలాద్రిం బ్రవేసించి ద
క్షిణ దిగ్భాగమునందు పైభవముగా జెల్వొందు లంకాపుర
మ్మును వీక్షించి మనంబునందు కడుసంక్షోభంబు సంధిల్లగన్ 3

కం॥ ఎక్కడ లంకాపట్టణ
మెక్కడ వానరసమూహ మెక్కడ సంద్రం
బిక్కడికి దాటివచ్చు ట
దెక్కడ కటుగష్టమంచు నెద దలపోసెన్. 4

గీ॥ ఇవ్విధంబున జింతించి యినకులేశు
శక్తికీ రావణుడెంత జలధియెంత
యని సమర్థించి శ్రీరాము నెదదలంచి
సూక్ష్మరూపంబుతో బురి జొచ్చుచుండ. 5

అక్కడ లంకిణి యనియెడి
రక్కసి పెనుభూతమట్లు రౌద్రాకృతియై
ఎక్కడివాడవురా నీ
వెక్కరణి బురంబుజేర నెంచితి వనగన్. 6

నీవెవ్వరిదానవు న
న్నెవిధి నడిగెదవు ముందు నీవెరిగింపన్
నావిధమును దెల్పెదనని
యావాయు సుతుండు బల్కె నది యిట్లనియెన్. 7

నేను లంకేశుపనుపున నీ నగరికి
రక్షగా గోట వాకిట బ్రాకటముగ
గాచియుండెద నెవ్వరైనగాని వచ్చి
యడుగుపెట్టిన బోనీక హతమొనర్తు. 8

అనిపల్కిన నాతండో
వనితా యీపురము జూడవలెనని యిటకున్
జనుదెంచితి పురవిభవము
గనివచ్చెద బోవనిమ్ము కాదనబోకన్. 9

చూచివత్తుగాని సుదతి నేనెత్తుక
బోవువాడనుగాను పురమటన్న
నదియుదల్చి మేను నద్భుతంబుగబెంచి
యొక్కపోటు బొడిచె నురముపైన. 10

అదిగని మారుతి లంకిణి
యెదగాటముగాగ బొడువ నిల నరచుచు న
య్యది వ్రాలి లేచి యాతని
పదములకు నమస్కరించి భయవిహ్వలయై. 11

గీ॥ స్వామి యీపురి నిర్మింప సమయమందు
బ్రహ్మదేవుడు ననుజూచి పలికెనిట్లు
యెపుడు కపి నిన్ను నొప్పించునపుడు దనుజ
కులము నశియించునని నాకు గుఱుతు చెప్పె.

కం॥ కావున నీ కార్యమునకు
పావనముగ జయముగల్గు పనిగొనుమనుచున్
దీవించి పనిచె నంతట
భావమ్మున సంతసించి పవనాత్మజుడున్.

ఆ॥ వె॥ దనుజ నాశనంబు తలచి యావాకిట
మొదట నెడమకాలు మోపి దాటి
సూక్ష్మరూపమునను జొచ్చి కోటలు నిండ్లు
వీధు లాదిగాగ వెదుకసాగె

చ॥ వెదుకుచుబోయి పోయిమది వేసటనొందక నెల్లచోటులన్
గదియుచు నిద్రనున్న పురకాంతలనెల్లను పారజూచుచున్
దుదక సురేంద్రునింట నొక తోయ్యలిరూప కళా విలాస సం
పదలు జెలంగ గన్పడగ భావమునందు ముదంబు సంధిలన్.

కం॥ గంతులు వేయుచు సీతా
కాంతను గనుగొంటినంచు కౌతుకమతియై
యెంతయు బరిశోధింపగ
మంతనమున సంశయంబు మల్లడి గొనియెన్.

ఆ॥ వె॥ పరమసాధ్వి సీత పరునిచెంగట నిట్లు
హావభావగతుల నలరనౌనె
కాదు దైత్యనాథు కాంతయౌనని యెంచి
తిరిగి వెదుకసాగె దిట్టముగను.

గీ॥ కడు బ్రవీణత బురమెల్ల కలయదిరిగి
తుద నశోకవనంబున వెదకుచుండి
రాక్షసస్త్రీల నడుమ దురంత చింత
రామనామస్మరణజేయు రమణిగాంచి. 18

గీ॥ శింశుపావృక్ష మెగబ్రాకి సీత దైన్య
మరసినంతనె యెంతయు నాత్మయందు
ఘోర సంతాపమును బొంది కుందుచుండ
రావణుం డచ్చటికివచ్చె బ్రాభవముగ. 19

గీ॥ వచ్చి రాక్షసవనితల హెచ్చరించి
సీత సమ్మతిపడదంచు జెప్పినంత
రెండు మాసములకు వినకుండెనేని
చంపి తినుడంచు జెప్పి యా సతిని జూచి. 20

కం॥ నారీమణి నావైభవ
మారయ కిటు పేదవైన యధమాధముడై
ఘోరాటవులఁ దిరిగెడి
యారాముని దలచి యేల యలమటబొందఁ. 21

కం॥ అని యిటుబల్కిన యాసతి
వినజాలక మిగులదుఃఖ వివశాత్మకయై
కనుగొనల నీరు గ్రమ్మగ
మునుకొని రామాయటంచు బోరున నేడ్చెఁ. 22

కం॥ అంతయు గనుగొని మహిత
స్వాంతకు భరియింపరాని సంకట మొదవెఁ
యెంతటి ఘోరంబని హను
మంతుడు సంతాపమగ్న మానసుడగుచుఁ. 23

ఆ॥ వె॥ వీని నేలగూల్చి జానకీదేవిని
స్వామిచెంత జేర్చవచ్చు గాని
నన్ను వీడు జంపినట్లైన యీ వార్త
స్వామి కెరుకపరచు వారలెవరు. 24

మ॥ అని చింతాకలితాత్ముడై పవనజుం డావృక్షమందుండ రా
వణు డాజానకి కెంతయుఁ గసరుచుఁ భర్జించి తర్జించి యా
దనుజస్త్రీలకు నాజ్ఞపెట్టిచన నాదైత్యాంగనల్ నెమ్మదిఁ
వనమం దొక్కట నిద్రబోయిరి దయాభావంబు సంధిల్లగన్. 25

ఉ॥ అంతట జానకీరమణి హా రఘునాయక యిట్టి బాధకిం
కెంతని యోర్తు దుర్మరణమే శరణమ్మని సాహసింపగా
నంతట వామనేత్రములు శుభావహమై యదరంగ నాత్మ నొ
క్కింత ప్రశాంతమొంది హృదయేశునిభక్తి దలంచుచుండగన్ 26

ఆ॥ వె॥ చెట్టుమీదనుండి చింతిల్లబోకమ్మ
రామచంద్రు డిటకు రాగలండు
రాక్షసేంద్రుగూల్చి రక్షించు నిన్నంచు
పలికె నద్భుతముగ పవనజుండు. 27

కం॥ ఇదియే మెక్కడ నుండియొ
సదమల శుభవార్త వినగజాలితి నంచున్
ముదమొంది జానకీసతి
విదితంబుగ నూర్ధ్వదిశను వీక్షింపంగన్. 28

గీ॥ మెల్ల మెల్లన హనుమంతు డుల్లమలర
చెట్టుదిగి నమస్కారము జేసినంత
అసురమాయ యటంచెంచి యరయకున్న
అంగుళీ ముద్రికను భక్తినమ్మకిచ్చె. 29

గీ॥ ముద్రికను జూచినంత సమ్మోదమును జెంది
అంజనేయునిగాంచి యోయనఘమూర్తి
యెచటనుండియు వచ్చితి వెవరునీవు?
తెలుపుమని జానకీదేవి పలికినంత 30

కం॥ తనవిధము, రామునివిధ
మును సర్వస్వము వివరముగ వినుపింపన్
కనులారా గాంచినంతటి
యనువునవిని సారసాక్షి యానందించెన్. 31

ఆ॥వె॥ ఆంజనేయు డిట్టులంతయు వినుపించి
తిరిగిపోదలంచి గురుతుకొక్క
వస్తువిమ్మటన్న వరశిరోరత్నంబు
ముదిత తీసియిచ్చె మోదమలర 32

కం॥ అదిగైకొని నా కాకలి
యొదవెను తల్లీ ఫలంబు లొగిభక్షింపన్
మదిగొంకక సెలవిమ్మని
పదములకు నమస్కరించి భక్తిని గోరన్ 33

కం॥ ఇక్కడ లెక్కకు మీరిన
రక్కసు లున్నారుగాన రాలిన ఫలముల్
చక్కనివి, యేరి తినుమని
యక్కోమలి పలికినంత నతడుద్యతుడై 34

కం॥ ఆరావణునకు దెలుపక
యూరకనే దిరిగిపోవు టొప్పునె యనుచున్
సారతర వృక్షజాలము
ధారుణి బడగూల్చుచుండె దైత్యులు బెదరన్ 35

ఆ॥వె॥ కదిసి దనుజభటులు కడురోషమునబోర
దనువు బెంచి వారిధాత్రిఁగూల్ప
అసురనాథు కడకు హతశేష దానవు
లరిగి తెలుప నాతడాగ్రహించి 36

గీ॥ రణబలోదగ్రులైనట్టి రాక్షసులను
సైన్యయుతముగ బంపిన పరభసమున
వచ్చినంతట వృక్షముల్ వాయుసుతుడు
విసరివైచుచు హతమార్చె విస్మయముగ. 37

కం॥ పదపడి నక్షకుమారుడు
పదిలంబుగ భటులుగొల్వ పైకొని రాగన్
అదలించి వానిగూల్చిన
కదిసిన రాక్షసబలంబు కకవికలయ్యెన్. 38

కం॥ కొందరి జేతుల నలచుచు
గొందరి వాలమున జితుకగొట్టుచు ధరపై
నందరిని గూల్చి వృక్షము
నందు నిరీక్షించుచుండె నసురులకొఱకై. 39

ఉ॥ అంతయెరింగి రావణుడు హాతసయాచుని దుఃఖమగ్నుడై
యెంతయు జింతనొందుతరి జ్యేష్ఠతనూభవు డింద్రజిత్తు దు
ర్దాంత పరాక్రమ క్రమమెలర్ప సుహోగ్రిత నార్భటించుచున్
జెంత కెదుర్పరాగ గని చెంగునదూకె గపీందుఁడుద్ధతిన్. 40

ఆ॥వె॥ కదిసి వానిరథము కాలితో దన్నిన
విరిగితుంటలైన విరథుడగుచు,
దనుజుడాత్మమెచ్చి తరచి వాయువ్యాస్త్ర
మతనిపైనవైచె నార్భటముగ. 41

కం॥ వాయుకుమారుడు గావున
వాయువ్యాస్త్రంబు తృణమువలె కడచనగా
నాయెడ రౌద్రాస్త్రంబును
వేయగ నది చనియె రుద్రబీజాండగుట౯. 42

గీ॥ అసురు డడిగని యెంతయు నాగ్రహమ్ము
జెంది బ్రహ్మాస్త్రమునువైవ జిత్తమందు
బ్రహ్మమంత్రము జపియింప బ్రాణహాని
కాక బందీకృతుండయ్యె గపివరుండు. 43

ఆ॥వె॥ దనుజవర్యులతని త్రాళ్ళచే బిగియించి
పట్టితెచ్చి రాజుసజ్జ నిలుప
నధిపుడాగ్రహమ్ముగ హనుమంతు నదలించి
పలికెనిట్లు రోషభాషణముల. 44

శా॥ ఓరీవానర, దుర్మదాంధ యిటుమా యుద్యానవనముం చేరి బల్
క్రూరప్రక్రియ వృక్షముల్ జెరికి రక్షోవర్గమున్ ద్రుంచి, నీ
వీరీతి౯ జరియించి నాడవుర, నీవెవ్వాడ విట్లంపి రె
వ్వారో తెల్పుము తెల్పకున్న నిపుడే ప్రాణంబులన్ దీసెదన్. 45

కం॥ అని పల్కిన వినయట్లుగ
హనుమంతుడు తోకజెంచి యాటనిరంబెన్
ఘనతరమగు పీఠంబై
యెనయుగ గూర్చుండి యతని కిట్లనితెలిపె౯ 46

కం॥ నేనే రాముని బంటును
జానకి సేమంబు నరసి సంతసమున ని౯
గాన దలంచి యేనీగతి
దానవుల౯ గూల్చినాడ దర్పమెలర్ప౯. 47

కం॥ నాకంటె మేటిబంటయును
రా కోట్లకొలది వనచరావళి తోడన్
కాకుత్స్థుఁ డిటకు వచ్చును
నీకంఠమ్ములను ద్రుంచు నిక్కము సుమ్మీ. 48

గీ॥ జానకీదేవి నిష్ఠుడైన స్వామికిచ్చి
శరణు వేడుము మన్నించు శాంతమూర్తి
కాదనుము తెగనీల్గిన కడకు దైత్య
వంశనాశన మగుదాక వదలబోడు. 49

కం॥ అని దర్పోన్నతి బలికిన
దనుజేంద్రుడు భటులఁ జూచి చెడయుర యీకో
తిని బట్టిచంపి తినుడని
యనగ విభీషణుడుగాంచి యతివినయమునన్ 50

ఆ॥వె॥ అగ్రజన్మ యింతయాగ్రహ మెందుకు
శాంతిపొందు మితని జంపరాదు.
దూతలధిపునాజ్ఞ దూషించి పల్కుట
తప్పుగాదు రాజధర్మ మరయ 51

కం॥ కావున బ్రాణము దీయక
యీవానరు విడుమటొప్పు నిదిగాకున్నన్
యేవిధమైన దండన
గావింపుము రాజనీతి కనుగొను మన్నన్. 52

ఆ॥వె॥ ఇదియె మంచిదిప్పు డీకోతితోకను
కాల్చివిడువుడంచు గౌతుకమున
నధిపుడాజ్ఞ సేయ నందరు హనుమంతు
ద్రాళ్ళతో బిగించి దర్పమెసగ 53

గీ॥ చిక్కెరా వానరుడు మనచేతికంచు
వీధివీధిని ద్రిప్పుచు వేడ్కమీర
తైలమున వస్త్రములుముంచి వాలమునకు
జుట్టియగ్ని దగిల్చిరి సుర్కిక్కమనుచు. 54

ఆ॥వె॥ ఇంతవరకు నాతడేమియు బలుకక
అదరుబెదరు జెందినట్టులుండి
యెగసి హుంకరించి యిల్లిల్లు గాల్చుచు
మది బఠించె నగ్నిమంత్రములను. 55

కం॥ అదిగని యెంతటి సంకట
మొదవెను గురుమతికటంచు సుర్వీజయు నె
మ్మది నగ్నిదేవు రాముని
సదమల మతిదలప నగ్నిచల్లగ నయ్యెన్. 56

కం॥ అంతట హనుమంతుడు పుర
మంతయు గలయంగ దిరిగి యతిఘోరముగన్
గంతులు వేయుచు దనుజుల
స్వాంతములు కలంగునట్లు చరియింపంగన్. 57

సీ॥ ఈకోతి నిటుబట్టి యింగలం బంటించి
యెంతజేసిరటంచు నేడ్చువారు
తల్లులు తమతమ పిల్లలగానక
వీధివీధినిదారి వెదకువారు
తమతమ వస్తుసంతతి దెచ్చుకొనబోయి
మంటలలోజిక్కి మాగ్గువారు
తమయిందు లగ్నిలో కుములుచుండుట జూచి
యెదవాదుకొనుచు దుఃఖించువారు

దేవదేవుని భార్యనుదెచ్చి యిట్టు
లధిపు డెంతటిపనిజేసె ననెడివారు
వస్త్రములుగాలి నపుగెత్తువారు గలిగి
మిగుల హాహానినాదముల్ మిన్నుముట్టె. 58

కం॥ హనుమంతుం డా విస్మృతి
తనతోకను సలిలమందు ముడిచి ధరిత్రి
తనయ కడకేగి తనవిధ
మును సర్వస్వంబు తెలిపి ముదమారంగన్. 59

కం॥ తల్లీ శ్రీరఘురాముల
కుల్లాసముతోడ నంతయును దెల్పి వడిన్
యెల్లరము కదలివత్తుము
చల్లగ సెలవిమ్మనాకు చనియెద ననగన్. 60

గీ॥ జానకీదేవి సమ్మదస్వాంత యగుచు
సేమముగ బోయిరమ్మని సెలవొసంగ
వాయువేగముతో వేగి వార్ధిదాటి
వానరావళి కడవ్రాలి వాయుసుతుడు 61

కం॥ కనుగొంటిని జానకిని
తనవిధమంతయును సమ్మదమ్మున దెలుపన్
వనచరులు కార్యసిద్ధుని
గనగల్గితిమంచు నెరిగి గంతులువైవన్. 62

ఆ॥వె॥ జాంబవంతుడంత సంతోషితాత్ముడై
ఇంక జాగుసేయనేల మనము
శీఘ్రముగను ప్రభువుచెంత కేగుదమంచు
పయనమొనరజేయ బలికినంత. 63

గీ॥ అందరు ప్రయాణమైపోయి యతిరయమున
మధువనమున ప్రవేశించి, మధువుగ్రోలి
ఫలములందరు భక్షించి భయములేక
నందు విహరింప సుగ్రీవు డాగ్రహించి 64

కం॥ ఇది నా వనమని సుంతయు
మదినెన్నక యింతగర్వమతులై యిటులన్
గ దిసిరిక వీరినిప్పుడె
మదమడచెద నింతయేని మన్నన గొనకన్. 65

కం॥ అనిరోషమ్మున బలికిన
కనుగొని యా లక్ష్మణుండు కపివర యిటులన్
వనచరులు మెలగుచున్నగ
మనపని సాధించినట్లు మనమున దోచెన్. 66

చ॥ అనవిని శాంతమొంది ప్లవగాధిపు డాకపివీరు లందరిన్
జనువున రాఘవేశ్వరుని సన్నిధికిన్ బిలిపించి నంతటన్
మునుకొని వాయునందనుడు మ్రొక్కి శిరోమణినిచ్చి జానకిన్
గనుగొని తల్లినుండి యిదిగైకొని వచ్చితినంచు దెల్పెనన్. 67

గీ॥ అవనిజాత శిరోమణి నధిపుడొంది
కన్నులారగ జానకిన్ గాంచినట్లు
దలచి కన్గవలం దశ్రుధార లొలుక
నరయుచుండగ హనుమంతు డాత్మనలరి 68

కం॥ స్వామి మీ యానతి గొని
మేమందర మడవులందు మిన్నకయెంతో
నీమమ్మున వెదకుచు జని
యేమేమియొ గష్టపాటు లెనసితి మనుచున్. 69

ఆ॥ వె॥ పూసగ్రుచ్చినట్లు పొలుపారఁ బోయిన
పోకడలను జెప్పి పురవరంబు
గాల్చి జనకసుతను కనుగొన్న సంగతి
విశదముగను చెప్పె వేడ్క మీర. 70

కం॥ అంతట శ్రీరాముడు హను
మంతునిగని నీవు తిరిగి మరలెడి వేళన్
కాంతామణి యేమనియెను
స్వాంతమ్మున వినగ గోర్కె జనియించె ననన్. 71

గీ॥ స్వామి కథలేని నాధుఁ బదినెలలుగ
గడిపితిని రెండు మాసముల్ గడచెనేని
నన్ను దెగటార్తునని దైత్యనాథుడనియె
గాన త్వరలోనె యిటఁజేర గడగుడనియె. 72

గీ॥ చిత్రకూటమునం దొక్క చెనటికాకి
నన్ను బొడిచిన దౌష్ట్యని నాథు డిప్పు
డింత దుష్టునిచేత నే నిడుములొంద
మది సహించునె చెప్పక హనుమ యనియె. 73

చ॥ అని వచియించినంత మహితాత్ముఁడు రాముడు లక్ష్మణార్కజుల్
వనచరులందఱున్ విని సెబాసు భళీ యని యాంజనేయునిన్
ఘనముగ మెచ్చి తార్క్ష్యుడును గాలియుఁగాక మరెవ్వరేనియున్
వననిధి దాటనోపుదురె వైరులపట్నము గాల్చివత్తురే. 74

కం॥ అని యెంతయు మోదమ్మున
హనుమంతుని పొగడుచుండ నా రఘురాముం
డనఘాత్మ చిరంజీవిగ
మనగలవని యాంజనేయ మస్తము నిమిరెన్. 75

గీ॥ ఇంక తడయగరాదని యెంచుచుండు
సర్వ వానరులనుబిల్చి సమరమునకు
సిద్ధమైయుండుమ టాజ్ఞ జేసినంత
ప్రాకటాటోపమున మించె ప్లవగ బలము. 76

ఉ॥ ఎక్కడిదజ్జాసినన్ మది గణింపగ సాధ్యముగాక యెంతయున్
మిక్కుటమైన యార్భటిని మేదిని కంపము జెందునట్లుగా
దిక్కులు పిక్కటిల్ల జనుదెంచి కపీశ్వర యేమియాజ్ఞ యం
చక్కపి సేనలెల్ల వినయమ్మున బారులుదీరి నిల్వగన్. 77

కం॥ కపిసేనలార యిప్పుడే
నృపవర్యుడు మెచ్చునట్లు నేర్పుజెలంగన్
విపులముగ రావణునిపై
నిపుడే దండెత్తుడంచు నినసుతు డనగన్. 76

సీ॥ ఏ నొక్కడనె వాలు దానవేంద్రుని ద్రుంప
నరయుమంచు దటంచు ననెడివారు
ఫెల్లున నుగ్రులై పెడబొబ్బలిడుచును
వీరులై గంతులు వేయువారు
ఇపుడె రావణుబట్టి యీడ్చి తెచ్చెదమంచు
స్రిభువుతో ప్రజ్ఞలు బలుకువారు
పండ్లకొమ్మలు చేతబట్టి యొక్కొకపండు
నమలుచు వేడ్కతో నడచువారు

అమిత పదఘట్టనలచేత నరుగువారు
నగుచు గంభీరముగ నట్టహాసమెసగ
వీరగర్జనము లొనర్చి విక్రమించి
దక్షిణాభిముఖంబుగా దండువెడలె. 79

గీ॥ ఇట్లు బయనించి యందందు హితము లైన
కొలకులను నీరుద్రావుచు కొండలందు
నెసగుఫలముల దృప్తి భక్షించుకొనుచు
కదిమి పిర మహేంద్రాద్రి కడకుజేరి.

ఉ॥ ఆగిరి మెక్కి దాశరథి యంబుధి దగ్గర గానుపింప నీ
సాగర మెట్లు దాటనగు సాధ్యము గాదని యెల్లరచ్చటన్
ఆగెదు నప్డొనర్చి తన నాత్మజుతో వగినట్టి మోచనల్
సాగగ జేయుచుండ సుర వైరివరేణ్యుడు జూచె నిందరి

ఆ॥ వె॥ అంత మంత్రివరుల సభకికి రప్పించి
వానరుండొకండు వచ్చి యిట్లు
సీతవార్త నరసి పెలరేగి రాముని
దండు విడియజేసె దర్పమెసగ.

చ॥ అని యిటు పల్కినంత దనుజాధిప యెందులకింత చిం
మనుజులు కోతులెంతటి సముద్రుల వారధిదాట సాధ్యమా
జనపతి వార్ధినొంపగల శక్తి మె యుండిన యింతకా
మనమున నోర్చియున్నె యనుమానముజెందగ నీకు జె

గీ॥ ఇప్పుడే మమ్ము బంపించు మేలుమీర
వారి పెగటార్తుమని మంత్రివరులు పల్క
వెడల యత్నించుచుండ విభీషణుండు
వినయమున నన్నతో నిట్లు విన్నవించె.

కం॥ శ్రీరాముడు భగవంతుడు
ఘోరున దైత్యులను బాల్యమునసే దున్మించెన్
గౌరీశు ధనువు విరచెను
వీరల దుర్వాక్యములను వినబోకన్నా.

ఆ॥ వె॥ వానరుండొకండు వచ్చి దైత్యులగూల్చి
లంక గాల్చిపోయె బింకముగను
యిట్టివీరు లచట యెన్ని కోట్లున్నారొ
అరసి శాంతమొందు మగ్రజన్మ. 86

కం॥ అని యిటు పరి పరి విధముల
దనయన్నకు శాంతిగూర్చ దర్కింపంగా
ఘన కోపమ్మున నాతం
డనుజుండన్న గావటంచు సంభ్రముల దన్నెన్. 87

ఆ॥ వె॥ మరల దన్నబోగ మంత్రి లడ్డమువచ్చి
శాంతపరచుచుండ సరుకుగొనక
నితని ముఖముజూడ నిప్పుడే మెడబట్టి
వెడలద్రోయుడనియె భీకరముగ. 88

గీ॥ అంతట విభీషణుండు ప్రశాంతమూర్తి
పాపము ఫలించు నేను జెప్పంగనేల
యనుచు దనతల్లి సన్నిధి కరిగి మ్రొక్కి
వివరముగచెప్పె జరిగిన విషయమంత, 89

కం॥ పదపడి శ్రీరాముని కడ
కిదె వెళ్ళెద జనని యానతిమ్మని యనగన్
ముదమారగ దీవించుచు
విదితంబుగ నిట్లనెన్ విభీషణుతోడన్. 90

గీ॥ నాయనా నేను మున్ను నానాథుపలన
విన్నసంగతి యేమన విష్ణుడమర
రక్షకై ధాత్రి జనియించి రావణాది
దనుజులను జంపి నీ చిన్నతనయు నొకని
గాచి పట్టాభిషేకంబు గట్టుననియె. 91

కం॥ అని చెప్పి సనివిసంతట
ననువ్వగ నాకాశమార్గమందున జనుమన్
అనఘాత్మ శరణుఁజొచ్చితి
నని వేడెను రామచంద్రు సంప్రముఖవాలన్. 92

గీ॥ రాక్షసుడు మోసమునవచ్చె ప్రభువుపెంత
చేరనున్నాడు మతియేమి సేయగలడో
కొట్టుడీ చంపుడీ యనుచు దిట్టముగను
వానరాళి యచటికి వచ్చినంత 93

గీ॥ నేను రావణు తమ్ముడ నీతిచెప్ప
వినక మాయన్న ననుదన్ని వెడలనడచె
ధర్మ పరివర్తనంబున దనరువాడ
నని సమస్తంబుచెప్ప వా రతనిగాంచి. 94

కం॥ ఎక్కడ రావణుసోదరు
డెక్కడ సద్ధర్మనిరతి యిదియంతయు బల్
టక్కులు నమ్మకు మని
ప్రక్కింపు డటంచుకొట్ట జొచ్చెడియంతన్. 95

ఆ॥ వె॥ వాయుపుత్రుడరసి వారల వారించి
వినయపరుడు ధర్మ వివశుడితడు
సంశయింపదగదు సాహాయ్యకారియై
మనకు మేలు గూర్చు మహితుడనియె 96

ఉ॥ అంతట నవ్విభీషణుని యా రఘురాముడు చేరదీసి దు
ర్దాంత దయాంతరంగుడయి ధర్మగుణాకర నీ చరిత్రమే
నింతయు నాలకించితి నొకింతయు నీయెడ దప్పులేదు ని
శ్చింతగ దైత్యరాజ్య మభిషేకమొనర్చెద నుండు మిచ్చటన్. 97

కం॥ అని లక్ష్మణు సుగ్రీవుల
వనధికి జని సంత్రయుక్త పద్ధతి బలముఁ
గొనితెమ్మని పనిచిన వా
రనువుగ గొనితెచ్చి యివ్వ నభిషేకించెఁ. 98

కం॥ పదపడి వననిధి దాటగ
నదనైన యుపాయమెద్దియన దైత్యుండుఁ
ఇది దాటనగునె యీవన
నిధి నే బ్రార్థింపవలయు నెమ్మది ననియెఁ. 99

చ॥ ఇటుల దలంచుచుండ దనుజేశుడు వానరవీరు లెంతయుఁ
బటుతర శక్తిమంతులని భావమునందు గణించి దూత న
చ్చటికి ప్రశాంతవాక్యముల సంధిగుదుర్పగ బంపనెంచి యు
ద్భట కలుషాత్ముడౌ శుకుని తద్దయు జేరగదీసి యిట్లనెఁ. 100

గీ॥ ఇపుడు సుగ్రీవు సన్నిధికేగి నీవు
మీకు మాకును వైరంబు లేకయుండి
మానవుడు బుజ్జగించెడి మాటల కిటు
మాపయిఁ జోరవచ్చుట మంచిదగునె. 101

కం॥ అని నా దిగ్విజయంబుల
ననువుగ వినుపించి వానరావళి మగుడఁ
జనునట్లు జేసిరమ్మని
పనిచిన నాతండు ప్లవగ పతికడజేరెఁ. 102

గీ॥ చేరి సుగ్రీవునిఁ మోదమార పొగడి
మీకు మాకును వైరంబు లేకయుండి
మానవుడు బుజ్జగించెడి మాటలకిటు
మాపయిన్ జోరవచ్చుట మంచిదగునె. 103

కం॥ ఇదిగాక దనుజనాథుని
నెదిరించెడివారుగలరె హిమగిరి నెత్రైన్
మదమడచె సర్వసురులను
మది నాలోచించి నీవు మరలుము పురికిన్. 104

చ॥ అనవిని వానరాళి కమనాగ్రహ మొందుచు సద్దురాత్మునిన్
ఘనమగు ముష్టిఘాతముల కండలు ప్రయ్యలొనర్చి మానకన్
గొనగొని ముక్కునున్ జెవులు గోయగ రాముడు మాతజంప రా
దని విడిపించి పంపజనె దానవమంత్రి విషాద చిత్తుడై. 105

ఆ॥వె॥ రామచంద్రుడంత రత్నాకరముచెంత
జేరి మంత్రయుక్త శిష్టనిరతి
దారి యిమ్మటంచు దర్భశయ్య నమర్చి
అధిపుడందు నిష్ఠ నధివసించె 106

కం॥ ఎంతయు బ్రార్థించిన నిసు
మంతయు నెడమీయకున్న నారసి యుగ్ర
స్వాంతుండై యంబుధి జల
మంతయు నంకింతునంచు నస్త్రముబూనన్. 107

గీ॥ జడిసివచ్చి సముద్రుండు స్వామినీవు
కట్టుమిటసేతువు న్నేను కట్టుబడుదు
నస్త్రముపసంహరించు మటంచు బల్కా
శాంతమున నస్త్రమును మాన్చె జనవిభుండు. 108

కం॥ వననిధి వారల గనుగొని
ఘనగిరులును వృక్షములును కడకేమైనన్
గొనితెచ్చి నలునిచేతనె
యనువుగ గట్టించు సేతువని వచియించెన్. 109

గీ॥ బాల్యమున మౌనిసుతలను బట్టి జలధి
వేయుచుండంగ శాపము బెట్టలేక
ఈనలునిచేత యేపనుపైన జలధి
బడిన మునుగక తేలాడబడును గాక. 110

కం॥ అని మునులు బల్కినందున
మునుగక సేతువునుగట్టు మునుకొని నలుడం
చను పెరుగునట్లు బల్కిన
విని యందరు జలధిగట్టు వెడలిరి పేర్మిన్. 111

గీ॥ అంత వానరులందరు వనములోని
గిరుల వృక్షములనుదెచ్చి సరభసమున
నలున కందివ్వ నిమ్మపండ్లట్లు చేత
నెగురవేయుచు బొందించె నెల్లగిరుల. 112

గీ॥ ఉద్ధతిని యిట్లు పదునాల్గు యోజనములు
తొలిదినముగట్టి మరునాడు సలలితముగ
నుదధి బంధించి రేబది యోజనములు
పట్టుదల నిట్లు సేతువున్ గట్టుచుండ. 113

గీ॥ రామచంద్రుడు సుగ్రీవ లక్ష్మణులును
సేతువునుజూడ నచటికి జేరినంత
ఉడుత యొక్కటి కడునొద్ద నుదధి మునిగి
యిసుక బొరలును సాయమ్మై యొసగుచుండె. 114

చ॥ అదిగని రామచంద్రు డహహా యని లక్ష్మణ దీనిజూచితే
సదమల భక్తితో మనకు సాయమొనర్పదలంచె చూడగా
మది ముదమాయెనంచు బహుమాన పురస్కృతి దానిబట్టి నె
మ్మది నిమరంగ గీతలుగ మానితరీతి నెసంగె మేనిపై 115

గీ॥ ఇట్లు వారలు సేతువు నెలమి జూచి
మిగుల వానరవీరుల మెచ్చుకొనగ
మొనసి మరునాడు పూర్తిగా ముగియజేసి
తేజరిల్లిరి విశ్రాంతి దీప్తిమెరయ. 116

గీ॥ కుసుమవర్షము దేవతల్ కురియజేసి
సేతుబంధన మెవరేని శిష్టరీతి
జూచినను, జెప్ప వినినను శుభములొంది
ఆయురారోగ్యములు గాంతురని నుడివిరి. 117

కం॥ శ్రీయుతమై యలరెడి రా
మాయణము చతుర్థభాగ మారూఢి నిలన్
జాయని సద్భక్తిని సు
శ్రేయుత రాష్ట్రాటి ఓబిరెడ్డి రచించెన్. 118

కం. ఈ రామాయణకథ నె
వ్వారేనియు వినిన జదువ వ్రాసిన యేనిన్
శ్రీరాముకృపను సంపద
లారోగ్య శుభంబులులొంద నయ్యెడుగాకన్. 119

—(౦)—

## పంచమ భాగము

—)o(—

శ్రీలోలా! సద్ధర్మ వి
శాలా! కరుణాలవాల! సామజపాలా!
లీలాలోల! సుశీలా!
లాలితశుభ సుగుణజాల! రామనృపాలా! 1

అంచితముగ సేతువలర గట్టెడిదాక
నిల జతుర్థభాగ మెలమిజేసి
అది మొదలుగాగ నటుమీద పంచమ
భాగమే నొనర్తు బరమనిష్ఠ. 2

ఈగతి సేతువు ముగియగ
సాగరు డధిపునకు నవ్రజాలము లొసగెన్
వేగదలి సైన్యయుతముగ
రాఘవుడు సువేల భూధరమ్మున జేరెన్ 3

అచట దండు విడసినంతట రావణు
డరసి మంత్రివరుల నాత్మహితుల
కొలువుకూటమునకు బిలిపించి కపిసేన
యునువు దెలియవలయునని తలంచి 4

మహిత మాయాప్రభావులు మంత్రివర్యు
లైన శుకసారణుల వానరాళికడకు
వానరుల రూపమునబోయి వారిబలము
నంతయు నెరింగిరండని యానతిచ్చె. 5

కం॥ వారును రయమున సూక్ష్మా
కారులుగా జలధిదాటి కపులై యుపవనన్
జేర విభీషణు డీక్షించి
శ్రీరామునికడకు వారి జేర్చినవాడై.

గీ॥ రావణునిమంత్రులే వీరు రామచంద్ర
వానరులమాడ్కి నిచటికివచ్చి ప్లవగ
సేనలన్నియు గనుగొని వెంగియవట
చెప్పగా వచ్చియున్నారు చిత్తగింపు

కం॥ అని తెలియబల్క వారలు
ననఘ విభీషణుని పల్కులన్నియు నిజమే
మనుజేశ బ్రోవుమని పద
వనజములకు మ్రొక్కినంత ప్రభువిట్లనియెన్.

ఉ॥ దానవమంత్రులైన మనకు దప్పక యిప్పుడె జంపగాదగున్
గాని వధించి మనవలన గల్గెడి లాభమదేమి కావునన్
వానర వీరులంపరని వారక నారసి దైత్యనాశనం
జేసని పోయిచెప్పుడన నద్దనుజుల్ భయకంపితాత్ములై.

కం॥ అక్కడ జని దనుజాధిప
యెక్కడజూచినను వానరేంద్రుని బలముల్
మిక్కుటమై మనమిదికి
యొక్కుమ్మడి డైకొనంగ నున్నారనుచున్.

గీ॥ అచట దను పరిభవమాది యన్నిగతుల
సంగతులు చెల్ప నతడేమి సరకుగొనక
మేడపైనెక్కి వారల జూడదలచి
యరయుచుండె మంత్రులతోడ నచటజేరి.

కం॥ శుకసారణు లా రాముని
సకల బలంబులనుజూపి సర్వోద్ధతులఁ
బ్రకటముగ దెల్పి జానకి
నికనైనను రఘువరులకు నిమ్మని యనగఁ. 12

కం॥ కానీ నా బలమున కీ
వానరబలమెంత మనుజవర్యు౦ డెంతౌ
మానుడు మీ సంశయములు
నేనీ జానకిని విడువ నెన్నటికేనిఁ. 13

మ॥ సురలన్ జారగదోలినాడ నమరేశున్ గట్టుదిట్టంబునన్
బరగంగా విధియించినాడ యమునిన్ బంధించినాడన్ మహే
శ్వరు శైలంబు పెకల్చినాడను తపస్స్వాధ్యాయతన్ బ్రహ్మచే
వరముల్ బొందినవాడ నన్నెదుర నెవ్వండోపు జర్చింపగన్. 14

చ॥ అని యిటు మూర్ఖమూని దనుజాధిపుడయ్యెడ రామశీర్ష మ
ట్లనువుగజేసి తీసికొని యా ధరణీసుత చెంతకేగి యో
వనజదళాక్షి చూడు రఘువర్యుని నే వధియించి శీర్షమున్
గొని యిటు దెచ్చినాడ నిదిగోయని ముందట వైచినంతటన్. 15

గీ॥ అది గనుంగొని జానకి హా యటంచు
వసుధపై వ్రాలి కొంతసేపటికి లేచి
ప్రాణనాయక నీకెట్టి పాటుగల్గు
నని మనంబున గననైతి నక్కటకట. 16

కం॥ అని దుఃఖింపగ రావణు
డనువుగ బోధింపుడంచు నా దనుజస్త్రీ
లను హెచ్చరించి పోయిన
కనకరమున బల్కి రసురకామిను లిటులన్. 17

కం॥ అమ్మా యిది యొకమాయయె
నెమ్మనమున దీనిగాంచి నెగులొందకు సౌ
ఖ్యమ్ముగ సువేలగిరి ప్లవ
గమ్ములతో నున్నవాడు కడకెటు వచ్చున్ 18

ఆ॥వె॥ అనుచు సరమ చెప్పునంతలో శీర్షము
మాయశక్తి వదలి మాయమయ్యె
నచట వానరాళి యఖిలాట్టహాసముల్
చేయుశబ్ద మచట చెవులబడియె 19

గీ॥ అంత బనిరామునుమాని యవనిజాత
నెమ్మనమ్మున బతిని ధ్యానించుచుండె
రామచంద్రుడు గిరిశిఖరమ్మునుండి
అల విభీషణుతో లంకనరయుచుండె 20

కం॥ ఈపగిది రాముడటు లం
కాపుర వైభవమునెల్ల గనుగొనుచుండన్
ఏపున దనుజుడు విభవము
దీపింపగ నెదుట గొలువుదీరెన యంతన్. 21

గీ॥ అది గనుంగొని సుగ్రీవు డాగ్రహించి
దానవాధము దుర్మదాంధమున నిట్లు
వైభవము మాకు జూపగా వచ్చినావ
యని మహోద్ధతి జెలరేగి యతనిదాకె. 22

కం॥ ఓరీ రావణ వినుమ నే
శ్రీరాముని భటుడ నిన్ను జీల్చెదనని దు
ర్వారగతి నెగసి నెత్తురు
గారగ మోములను దన్నె గడు దర్పముగన్. 23

ఆ॥ వె॥ కనలి రావణుండు కపినాయకునిఁజట్టి
విసరి వైచినంత వీరవరుఁడు
గగనవీధి కెగసి కసుఁబల్కి రావణు
మకుటములనుఁ దన్నె మహినిఁగూల. 24

కం॥ నినుఁదోకఁబట్టి సంద్రము
లను ముంచిన వాఁడెవండు రావణ నేనా
తని తమ్ముఁడ సుగ్రీవుఁడ
కనుఁగొనుమిక నీకు నంత్యకాలం బయ్యెన్. 25

కం॥ అని ముష్టియుద్ధమొనరిం
పను బూనిన నొకరి నొకరు బహువిధములుగా
తనువులను రక్తధారలు
నెనయఁగ బోరాడి యెగసి యినజుఁడు వచ్చెన్. 26

ఉ॥ వచ్చిన వానరుల్ గని సెబాసు భళీ వహవాయటంచు బల్
మెచ్చఁగ రామచంద్రుఁడును మిత్రకుమారుని గౌగలించి యో
సచ్చరితాత్మ రావణుని జంపక గాసియొనర్చి ధీరతన్
వచ్చుట మేలుగల్గె మనుఁబల్కిన నా వచనంబు చెల్లఁగన్. 27

గీ॥ అసురవరుఁజంపి నీకు పట్టాభిషేక
మొనరఁజేయుదునని విభీషణునితోడ
మాటయిచ్చితిగాన దుర్మదునిఁజంప
నేనుగాకెవ్వరునుఁగాని పూనరాదు. 28

గీ॥ అనిపలికి లంకపై దాడి యొరుగఁదలచి
కోట్లకొలది వానరసేనఁగూడి రాము
మూర్తి యుత్తరద్వారంబు ముట్టడించె
దానవుల మానసంబులు తల్లడిల్ల. 29

ఆ॥ వె॥ అతులిత ప్రభావు లపవదికోటుల
వానరాళిగొల్వ బూనివచ్చి
పార్థివముగ పూర్వవాకిట నీలుండు
దండునిడిసె శత్రుదళము లదల. 30

ఆ॥ వె॥ అర్కజుండు మువ్వదారుకోట్ల నుపంగ
వరులుగొల్వ మరియు వాయుసుతుడు
బరగ విక్రమించి పడమటి వాకిట
దానవాళి యదల దండువిడసె 31

ఆ॥ వె॥ అంగదుండు వానరానీకములు గొల్వ
గజగవయ గవాక్ష ఘనులతోడ
నగరికవల దక్షిణ ద్వారమునవచ్చి
దండువిడిసె శత్రుదళము లదల. 32

ఆ॥ వె॥ ఇట్లు దండువిడిసి యినకులాధీశుండు
మొదట రాయబారముగ నొకండు
చనుట మేలటంచు జర్చించి పిలిపించె
వరగుణాఢ్యుడైన వాలిసుతుని. 33

గీ॥ అంగదా నీవుబోయి దైత్యాధమునకు
మనదళంబునగల విక్రమంబు నెల్ల
దెలియగాబల్కి యచ్చటగల విధంబు
దెలిసికొని రమ్మటంచు విధించి పనిచె. 34

కం॥ అంతట నతడా దనుజుని
చెంతకు విక్రమమెలర్ప జేరెన దనుజాల్
మంతనములు బల్కుచు దన
చెంతకు బంధింపుడంచు జేరియనంతన్. 35

గీ॥ వారి వారించి రావణుం డోరి యిట్లు
వచ్చినా వెవ్వఁడవు నిన్ను బంపి రెవరు
వివరముగ దెల్పుమనగ నవ్వీరవరుడు
నేను రామునిబంటును దానవేంద్ర. 36

సీ॥ రాముడెవ్వండన రణశూరుడై యొప్పు
భృగురాము గెల్చిన విక్రముండు
భృగురాము డెవడన పృథులవిక్రము గార్త
వీర్యార్జునోర్చిన వీరవరుడు
అరయ నా కార్తవీర్యార్జును డెవడన
నిను జెరబెట్టిన ఘనబలుండు
నిను జంకనిరికించి నీట ముంచీడ్చిన
ఘనుడైన వాలి నా కన్నతండ్రి.

ఇన్ని జెప్పగ నేటికి నిన్న నిన్ను
గాటముగబోరి రక్తము గారునట్టు
లడచిపోయిన సుగ్రీవుడనెడి సర్వ
వీర వానరపతియె నాపిన్న తండ్రి. 37

గీ॥ అని యిటుల బల్క రావణు డాగ్రహించి
యోరి దుర్మద నాచెంతమీరి యిట్లు
వదరుచున్నావు మున్నిట్లు వదరి తోక
గాల్చుకొనిపోయె నొకకోతి కనవె యనిన. 38

కం॥ కనకేమి హీనబలుడగు
హనుమంతుం డతని హాస్యమాడుచు జెంపల్
వనచరులు మోది విడిచిరి
యినజుని సైన్యమున లెక్కకెక్కవటంచున్. 39

15)

ఆ॥ వె॥ అతని నన్ను నిట్టి యసదైన పనులకు
పంపుచుండ్రు హీనబలులటంచు
నేర్పుతోడ బనులు నెరవేర్పలేకున్న
పరిహసించి వెడల బంపుచుండ్రు 40

ఆ॥ వె॥ ఇప్పుడైన సీత నినకులేశునకిచ్చి
శరణటన్నగాచు శాంతమూర్తి
కాక తక్కెనేని కాకుస్థు బాణాగ్ని
దహనమగుట నిజము దనుజ కులము. 41

చ॥ అని యిటుబల్కినంత దనుజాధిపు డెంతయు నాగ్రహించి యీ
వనచరు బట్టికొట్టి వెసప్రాణము దీయుడటంచు బల్కినన్
దనుజులు చుట్టుముట్టి త్రాళ్ళ బిగించుచునుండ నాతడున్
ఘనమగు ముష్టిఘాతముల కండలు జీల్చి వధించె నందరిన్. 42

కం॥ పదపడి రావణు మకుటము
లదరగ జరణముల దన్నియటు వినువీధిన్
గుదురు గజని తన బలముల
మదమున గలిసితెల్పె మునుకొని యంతన్. 43

గీ॥ ఇంతపనియైన దనుజుండు స్వాంతమందు
నరుకుగొనక మదమ్మునసే వలముబూని
మనుజవరులెంత కపులెంత మాకటంచు
గర్వమున మించి కన్నులు గానకుండె. 44

నేనింత బలియుతుడనై
యీ నరునకు వెరువదగునె యిప్పుద్ధతితో
మానిత వైభవ మరులకు
నే నుత్తర గోపురమున నెరుగం జేతున్. 45

॥ వె॥ ఆని సమస్త భూషణావళీ ధరియించి
మహి ధగద్ధగాయమానముగను
నురుఘటాళిగొల్వ నుత్తరగోపుర
మెక్కి సంతజూచె నినకులుండు. 46

॥ చూచి పవళించి యేయుండి చోద్యముగను
ధనువు పదనునబట్టి యుద్దండవృత్తి
శరమువైచిన పదివేల శరములగుచు
ఛత్ర చామర భూషాళి జగతిగూల్చె. 47

॥వె॥ అందు వొకనికైన హానికల్గకయుండ
భూషణాళి గూలిపోవునట్లు
పండి లేవకుండ బాణంబువైచుట
జూచి దనుజబలము చోద్యమందె 48

॥ అచట సుగ్రీవు డందరి నరసి యిపుడె
లంక ముట్టడి సేయవలయునటంచు
నాజ్ఞచేసిన కపు లట్టహాసమెసగ
పట్టణ ద్వారములు నాల్గు బట్టుకొనిరి. 49

॥ కడుబల్మి దనుజుల మెడకు తోకలుజుట్టి
దట్టించి వెనద్రిప్పి కొట్టువారు
తేకువమీరంగ మోకాల మోచేత
మూతులు విరుగంగ బొడుచువారు
ముష్టిఘాతముల బొమ్మలు వ్రయ్యలొనరించి
ధరగూల్చి కాళ్ళచే దన్నువారు
మొనసి చేతుల వృక్షములుబట్టి త్రిప్పుచు
దనజులమోది యదల్చువారు

ఇటుల ప్లవగులు దనుజుల నేచుచుండ
ఏమిసేయంగ వోచక యింద్రజిత్తు
యాగమొనరించి ఘోర శస్త్రాస్త్రవితతి
పడసి మాట్కొనె నదిలించి వానరులను. 50

కం॥ మాయాజాలము సేయుచు
నేయెడ గనుపింపకుండ నెంతయు బోరన్
ధీయుతులగు కపివరులకు
నాయెడ నేమియునుదోచ కరయుచునుండన్. 51

ఆ॥వె॥ రామలక్ష్మణుల సురద్వేషి నాగాస్త్ర
వితతి మూర్ఛనొంచి పీటకేగ
వానిమాయ గనుక వచ్చివిభీషణు
చెంతజేరె ప్లవగ సేనలెల్ల 52

గీ॥ అంతట విభీషణుడు వాలందరికిని
నీరుమంత్రించి చల్లిన నిమిషముననె
మాయదెరచెను వానరుల్ మహితశక్తి
దైత్యు నెదురింపనుండిరి దర్పమెసగ. 53

ఉ॥ రాముడు మూర్ఛదేలి యటులక్ష్మణుంగని దుఃఖమగ్నుడై
యేమియు దిక్కుతోచకిల నెంతయు గుందుచునుండ నారదుం
డామహనీయు చెంతకు రయమ్మునవచ్చి నమస్కరించి యో
స్వామి! ఖగేశ్వరుందలపు చయ్యన మూర్ఛదొలంగునంచనన్. 54

గీ॥ రామచంద్రుండు మదిని హర్షంబు జెంది
సత్వరమున గరుత్మంతు సంస్మరింప
మూర్ఛనుండియు లక్ష్మణమూర్తి తెలిసి
నిదురదేరిన కైవడి నిలచినంత 55

కం॥ అక్కడ రావణు డడిగని
చిక్కరుగద యెన్నివిధుల జేటులుగూర్పన్
రక్కసులెందరొ మడిసిరి
అక్కటకట యెట్టులనుచు నాలోచించెన్. 56

ఆ॥వె॥ కూర్మితమ్ముడైన కుంభకర్ణుని నేడు
నిద్రనుండిలేపి సెగులుదీర
కదనమునకుబంప గడతేర్చునంచవి
ననితలంచి దనుజులను విధించె 57

ఆ॥వె॥ కడగివారు కుంభకర్ణుని బలవంత
ముగను జెవుల శూలములను గ్రుచ్చి
కడుపుమీద భద్రగజముల ద్రొక్కింప
నిదురదేరి యతడు నీల్గిలేచి 58

గీ॥ ఆవలింపుచు వారలనరసి మీరు
నన్ను మేల్కొల్పినారు మాయన్న కిప్పు
డేమి కార్యముగల్గెనో యెరుగదెల్పు
డని వచించిన దెల్పిరి యాజ్ఞజేయ 59

ఆ॥వె॥ ఇటుల దెలియబల్క మెనుబోతుమాంసంబు
లాదిగా నొసంగ నన్ని మెసవి
త్రేపి మీసములనుదీటుచు గర్జించి
అన్నకడకుబోయి అనియెనిట్లు 60

చ॥ కదన మొనర్పబూనుటకు కారణమేమి వచింపు మిప్పుడే
కదిసి యరాతివర్గముల ఖండనజేసెదంచుబల్క న
మ్మదమున సర్వసంగతులు మానక దెల్పిన కుంభకర్ణుడ
య్యది కడుమూర్ఖమైనపని యంచుమనమ్ముననెంచి యిట్లనెన్ 61

క॥ అన్నా నిష్కారణముగ
నన్నాతనిదెచ్చి పోరన్యాయంబగునే
యెన్నగ రాముండెవడను
కొన్నాడవో లోకపాలకుండగుగాదే 62

క॥ అని పల్కిన నాతండో
యనుజన్మా నాకుదెలియు నైననువిడువన్
మనసొప్పదు రణరంగ
మ్మున చావోబ్రతుకో ముఖ్యముగ దేలవలెన్. 63

ఉ॥ పిల్లతనాన నాటికిని పృథ్విని గూల్చుట యంతబోక, మే
నల్లుని యోగసిద్ధి గమనప్పుడు ద్రుంచుట దుర్మదాంధుడై
చెల్లెలి ముక్కునుం జెవులు చెండుట పుత్రునిజంపి పట్టణం
బల్లరిజేసి కాల్చుజయు నారసి యెట్లు సహింతు జెప్పుమా. 64

ఆ॥వె॥ అనుచు నిశ్చయముగ నాతడుబల్కిన
పరశుఖండివాల శరములాది
ఆయుధములబూని యతి రౌద్రమూర్తియై
యుద్ధమునకు బోవ సిద్ధమయ్యె. 65

గీ॥ వెడలి పదఘట్టనములచే బుడమియదర
మిగుల కోలాహలధ్వనుల్ మిన్నుముట్ట
గదిసివచ్చెడి యా కుంభకర్ణు నరసి
వనచరాళి విభీషణు వద్దజేరె. 66

క॥ ఇదియేమి చోద్యమయ్యెడి
తుద మొదలెక్కడను మదికిదోచదు కడు దు
ర్మదమును పర్వతమట్టుల
కదనమునకు వచ్చెనెవడొ కనుగొనుమన్నా. 67

ఆ॥వె॥ వెరువబోకుడని విభీషణు డాతని
విషయమెల్ల నిట్లు వివరముగను
ఆ ప్లవంగులెల్ల నాశ్చర్యపడునట్లు
చెప్పగా దొడంగె నొప్పుమీర. 68

కం॥ పరమేష్ఠిగూర్చి యాతల
దరుదార తపంబుజేయ నజుడాతనిపై
గరుణించి కోరుమెయ్యది
వరమన నాకధికనిద్ర వాంఛితమనియెన్. 69

కం॥ ఇదియంత విష్ణుమాయయె
పదిలంబుగ వరమునితడు బడసిన యేనిన్
మదమున లోకము లడచును
గదయని భారతిని నోట గదియగజేసెన్. 70

ఆ॥వె॥ అని భయంబుదీర నంతయు వివరించి
వెరువబోకుడిప్పుడె వెడలుడంచు
సమరమునకుబంప సంసిద్ధులై వారు
తరులు గిరులుబట్టి తలపడంగ. 71

గీ॥ వారువై చెడి కొండలు వానహస్త
మునసె ద్రోయుచు వెనుగదబూనిపైన
లక్షలుగ వానరులు నేల వ్రాలినంత
గాంచి సుగ్రీవుడా కుంభకర్ణుదాకి. 72

గీ॥ ముష్టిఘాతం బెసగ వక్షమునకు బొడువ
రక్తసిక్తాంగుడై నేలవ్రాలి యాతడు
కొంతవడి దెప్పరిల్లి సక్రోధుడగుచు
ఘనపదముగుహాలి మతనిపై వైచినంత. 73

కం॥ ఆ విక్రమపరుడగు సు
గ్రీవుడపుడు మూర్ఛనొంది క్షితిపై వ్రాలన్
శీవిని గపిపరు నెత్తుక
రావణునకు జూపదలచి రయమున బోవన్. 74

కం॥ మనఖేని నసురు డెత్తుక
చనుచున్నాడనుచు ప్లవగ సైన్యము లెల్లన్
దనుజునిపై జనబూనగ
హనుమంతు డిట్టులనియె సందరితోడన్ 75

ఉ॥ ఏమిభయంబులేదు ప్లవగేశుడు మూర్ఛిలియున్న వాడు బల్
నేమముతోడ నాదనుజునిన్ గికురించి యదల్చి నేర్పునన్
మోమునదన్ని రాగలడు పోవకుడంతకు మించెనేని యు
ద్దామబలంబునన్ సకలదానవులన్ వధియింతమంచనెన్ 76

ఆ॥వె॥ కుంభకర్ణుడిట్లు గొనిపోవుచుండంగ
మూర్ఛదేరి యతని ముక్కు గొఱికి
చెవులనూడ బెఱికి చెలరేగి యెగసిన
అసురుడొడిసి త్రిప్పి విసరివై చె 77

గీ॥ అంత లాఘవమునబైకి నర్కతనయు
డెగిరి శ్రీరామచంద్రుని యెదుట వ్రాలి
దనుజునకు ముక్కుచెవులును తరిగివేసి
మరలితినటంచు జెప్పి నమస్కరించె 78

ఆ॥వె॥ ఇట్టి వికృత రూపమెసగ నేనేగతి
నగరమునకు బోవనగునటంచు
నాజిసేయ భీకరాట్ట హాసముతోడ
వనచరాళిపైకి వచ్చెనంత 79

కం॥ వనచరులందరు నాతని
తనువునకెగ బ్రాకి, మరికి తండములటు వెం
డును సందువడక దట్టము
గను మూగిన కొంతబాధ గన్పడనయ్యెన్ 80

సీ॥ ముకురంధ్రములదూరి కకవికల్గా గోళ్ళ
బరుకుచు బయటికి బారు వారు
మాతిమీసములను మగ్గురు నల్వురు
నొగిబట్టి యుయ్యాల లూగువారు
గట్టిగా పెదబొబ్బబెట్టు దానవునోట
మారి గిరుచు బయట్దేరువారు
పట్టుజూచినవాని పట్టుకు జిక్కక
గడుసూక్ష్మరూపులై పెడలువారు

నివ్విధంబున వానరులేపుమీరి
దేహమంతట నొరసి బాధించుచుండ
కనలి విదలించి వారిని గదుముచుండ
రాకు దాగ్రహమునవచ్చె రణమొనర్ప 81

చ॥ ఒకరినిమించి యొక్కరు మహోగ్రశరమ్ములు పూని వైచుచున్
సకలవిధంబులన్ ధయుద సంగరమున్ బొనరించుచుండి భా
నుకులవరేణ్యు డుగ్రమగు నూతనబాణము వైవగా మరు
న్నికరము మెచ్చ దానవుడు నీల్గెను దైత్యులు తల్లడిల్లగన్ 82

గీ॥ అంత హతశేష దానవులచట దెల్ప
రావణుడు తమ్ముడాయని వ్రాలి మదికి
యేమితోచక మిగుల యోచించుచుండ
నీతులను జెప్పజూచిరి నియమవరులు 83

ఆ॥ వె॥ తల్లికై కసియును తరుణిమండోదరి
మాల్యవంతుడాది మహితమతులు
నీతులుగ్గడించి నెమ్మినాతని కెన్ని
విధుల బోధసేయ వినగబోడు 84

ఆ॥ వె॥ ఇంద్రజిత్తువచ్చి యిందుకు చింతిల్ల
నేల నీకుతుండ నేనుగలుగ
సర్వశత్రువులను సంహార మొనరించి
నీకు ముదముగూర్తు ప్రాకటముగ 85

కం॥ అని తండ్రి యానతిం గొని
దనుజుల కోటానుకోట్లు దర్పమెలర్పన్
వెనుకొనిరాగ మహోద్ధతి
జనుదెంచెను శత్రువులను జంపెద ననుచున్ 86

ఉ॥ అంతట రామలక్ష్మణులు నాకపిసైన్యములార్చిపేర్చి దు
ర్దాంత పరాక్రమం బెసగ దార్కొని ఘోరరణంబొనర్ప నా
క్రాంతయు లెక్కసేయక మహీస్థలి కంపమునొంద భీకరా
క్రాంతముగాగ దార్కొనియె రావణపుత్రుడు చండమూర్తియై 87

కం॥ పరిపరివిధములుగా వా
నరులును దానవులు మూడునాళ్ళగ బోరన్
మరి యింద్రజిత్తు కడు భీ
కరమగు బ్రహ్మాస్త్రమప్పుడు గైకొనివైచెన్ 88

గీ॥ రామలక్ష్మణులను వానరాళియెల్ల
మూర్ఛగూలిన సమ్మంత్రియుక్తుడౌ వి
భీషణుడు జాంబవంతుని బిలువనాత
డనిలజుం డెట్టులున్న వాడని వచించె. 89

కం॥ ఇదియేమి రామచంద్రుని
మదిదలపక నెట్టుల హనుమంతుని యొకనిఁ
విదితముగ నడిగినా వే
మదియని తర్కించియడుగ నతడిట్లనియెఁ 90

కం॥ అతడుండిన కపులుందురు
అతడేలేకున్న బ్రతుకరందరు కపులున్
గుతకుత నరయు మనంగఁ
వెదకుము హనుమంతుడటకు వినిమే వచ్చె 91

ఆ॥వె॥ అంత జాంబవంతు డాయాంజనేయుని
చేరదీసి నీవు శీఘ్రముగను
పోయి ద్రోణగిరిని పొలుపారు సంజీవ
కరణిదెమ్ము జీవకళలనరసి 92

కం॥ అని పనిచినంత గడుసము
మునజని యాగిరినితెచ్చి యుంచట నిడగఁ
ఘనమైన యోషధుల వా
సనలొందగ లేచిరపుడు సైనికులెల్లఁ 93

ఆ॥వె॥ సర్వశత్రుప్రలను సంహరించితినంచు
వచ్చి యింద్రజిత్తు ముచ్చటలర
జనకునకుదెల్ప సంతోషమును బొంది
కౌగిలించె సుతుని గౌతుకమున 94

ఆ॥వె॥ తెల్లవారలేచి యెల్ల వానరులును
ధరణి తల్లడిల్ల దర్పముగను
సింహనాదములను చెలగి యార్చుచునుండ
నరసి రావణుండు నాత్మగుంది 95

ఆ॥వె॥ కుంభకర్ణు సుతులు కుంభనికుంభులు
నతుల శౌర్యధుర్యటకు వచ్చె
తండ్రిపగనుదీర్ప దైత్యేశు పనుపున
వెడలి రాజసేయ విక్రమించి 96

గీ॥ దనుజకోటులతోగూడి దర్పమెసగ
వచ్చి తలపడినంతట వానరులకు
దానవులకును ఘోరయుద్ధం బెలర్ప
లక్ష్మణుం డుగ్రమునవచ్చె రణమొనర్ప 97

ఆ॥వె॥ ద్వంద్వయుద్ధమునకు దలపడి యెంతయు
ఘోరముగనుబోరి క్రోధమెసగ
దానవద్వయమ్ము ధాత్రిగూలగజేసె
సర్వవానరాళి సంతసింప 98

ఉ॥ ఈవిధి నెందరెందరో మహీస్థలిగూలి నశించుచుండగా
రావణుడాగ్రహించి యసురప్రకరంబులుగొల్వ నాజికిన్
జేవదలిర్పగాజని విశేషవనాటుల గూల్చుచుండ నా
పావనమూర్తి రాఘవుడుపైకొనివచ్చి రణంబొనర్పగన్ 99

కం॥ హనుమంతుడు రాముని గని
దనుజుడు రథమందునుండ రాముడుధరపై
ననిసేయనేల యని భుజ
మున నెక్కించుకొని యుద్ధమును జేయించెన్. 100

ఆ॥వె॥ ఒకరిమించి యొక్క రుగ్రబాణములచే
శక్తిమీర బోరుసల్పుచుండ
నరవిరాము డర్ధచంద్రబాణము వైచి
దనుజు రథము నస్త్రతతి నడంచె 101

రావణున కస్త్రములులేక రథములేక
నిలచియుండగ రావణా నెలవుకేగి
తగిన రథబాణములుగొని తరలిరమ్ము
విగత శస్త్రాస్త్రుఁ జంపను వెడలిపొమ్ము 102

అని పలికిన దనుజేశుడు
తన మనమున సిగ్గుజెంది తడయక పురికిన్
జని చింతించుచు నుండగ
గని తనయుం డింద్రజిత్తు కడురోషమునన్ 103

జనకా మారణహోమం
బునుజేసి సమస్త్రశాత్రవులనిదెధ్వంసం
బొనరింతునంచు బల్కుచు
మునుకొని యాగముజేయ బూనినయంతన్ 104

అదియంతయు వేగులచే
విదితంబుగ నెఱిగి యవ్విభీషణు డదియున్
గుదురుగ నెరవేర్చినచో
కదనమ్మున వానిగెల్వగా వరయంగన్ 105

యాగవిఘ్నమ్ము సేయగా నేగుడంచు
ఆంజనేయాది వీరుల నంపినంత
వారిగని మాయసీతను వాడుదెచ్చి
ఖండనమొనర్చి యగ్నిలో గాల్చుచుండె 106

అంతట వాయుసంభవుడు హా యికనేగతి యేమిసేయనో
నెంతటి కార్యమయ్యె మన జేసిన కేమని విన్నవింతు ని
ట్లింతటి ఘోరయుద్ధ మొనరించియు నేమిఫలంబు జానకీ
కాంతను స్వామికర్పణముగా నొనరింపగ జాలమైతిమే 107

క॥ అని ఖిన్నవదను డై రా
ముని సన్నిధికరిగి దుఃఖముల నెరిగింపన్
మనుజేశుడు హా సీతా
యని ధాత్రిం బ్రాలె రావణానుజు డంతన్ 108

క॥ స్వామీ రాక్షస మాయయె
నేమున్దే యెరిగినాడ నేమాత్రంబున్
నీమది చింతింపకు మని
యామారుతి నపటికంపె యాగము జెరుపన్ 109

గీ॥ విఘ్నములు లెక్కసేయక విక్రమమున
నింద్రజిత్తు రణమునేయ నెంచిరాగ
లక్ష్మణుడు ద్వంద్వముగ ఘోరరణ మొనర్చి
దానవాధిప పుత్రుని ధాత్రిగూల్చె 110

క॥ అంతట సులోచనయును తన
కాంతుని మరణంబు తెలియగా గడుదుఃఖ
స్వాంతమయి మామ లాపము
చెంతకు జని సహగమనము సేయు తలపునన్

క॥ మామా నే సహగమనము
నేమమ్మున జేయనెంతు నీసుతు తనువున్
ధామమునకు దెప్పింపుము
స్వామిని నేకలసికొందు చయ్యన ననగన్ 112

ఆ॥ వె॥ రావణాసురుండు రణరంగమునను న్న
తనయు తనువుదేర దనకుసాధ్య
పడ దటంచు పలుక పడతి శ్రీరాముని
కడకు సాహసించి కదలిపోయి 113

కం॥ కడుభక్తి రామచంద్రుని
యడుగులకు నమస్కరించి యతిదుఃఖితయై
యడిగెను నాపతిదేహం
బిడు సహగమనంబొనర్తు నెలమి నటంచున్ 144

ఆ॥వె॥ అంత రామచంద్రు డాంజనేయుని బిల్చి
ఇంద్రజిత్తుదేహ మెందుగలదొ
వెతకి చూచి యతనిసతికి జేర్చెడు
నట్లొనర్చుమంచు ననిచినంత 115

ఆ॥వె॥ పతినిజేర్చ నాత్మపురుషుని తనువుతో
సహగమన మొనర్చె సచ్చరిత్ర
ఆమె సాహసమున కాశ్చర్య మొందిరి
అతుల సాధ్వియంచు ననురులెల్ల 116

కం॥ ఆ రావణు డిదియే కడ
సారి రణంబంచు సాహసంబున గడుదు
ర్వారగతి నార్భటించుచు
ధరణి గంపింపవచ్చె దనుజులు గొలువన్ 117

చ॥ అదిగని లక్ష్మణుండు మదినాగ్రహముంగొని దానవాధిపున్
పదునగు నస్త్రశస్త్రముల వక్షము వ్రయ్యలొనర్చి పేర్చినన్
మదమున రావణాసురుడు మంత్రయుతముగ శక్తిబూని నీ
విదె కడతేరినాడవని యేసిన మూర్ఛిలె లక్ష్మణుండిలన్ 118

శా॥ రాముండాగ్రహమొంది ఘోరముగ సంగ్రామంబు సంధిల్ల ను
ద్దామ ప్రాభవమొప్ప ధాత్రియదరన్ ఘట్టించి క్రూరాత్ము ని
న్నేమాత్రంబును వీడనంచు గమవహ్నిజ్వాల జాజ్వల్యమా
భీమాస్త్రమ్ములు మంత్రయుక్తముగ నావేశమ్మునన్ వేయగన్

ఆ॥ వె॥ ఆశరసుల ధాటి కసురుడోర్వగలేక
వెరచి పారిపోయి పురముజేరి
హితుల జెప్పు నీతులిప్పుడు మదినెంచి
చింతచేయసాగె జేష్టలుడిగి 120

సీ॥ మారీచుఁ డొగిఁజెప్పు మాటలు విననైతి
సలవిభీషణు పల్కు లరయనైతి
తాత సంబోధనల్ తలదాల్చ లేనైతి
తల్లిబోధలు విననొల్లనైతి
కుంభకర్ణుని పలుకులకు నోపనైతి
సతిపల్కు లారయజాలనైతి
ఆప్తుల బుత్రుల ననుజుల గోల్పోయి
గతులేమిగనక దుఃఖితుడనైతి

ఎందుజూచిన పదివేలుమంది రాము
లెదుట గన్పించుచున్న వారేమి నాకు
దిక్కుతోచక నెంతయు స్రుక్కనయ్యె
గటకటా యెంతటి నికృష్ట కాలమయ్యె 121

గీ॥ ఇంక జీవించి యేమి సాధించువాడ
వెలగి పాతాళహోమంబు జేసియైన
రాముని వధింతు లేకున్న రాఘవునకు
ననువు లర్పింతునని నిశ్చయం బొనర్చె 122

కం॥ అక్కడ సోదరునింగని సీ
మిక్కిలి శోకించుచున్న మిహిరకులేశున్
అక్కపినాథుడుగని నీ
విక్కరణిః దుఃఖమొందనెందుకు స్వామీ 123

కం॥ హనుమంతు డిచట నుండగ
మనలక్ష్మణమూర్తికొఱకు మనమున జింతన్
గొననేల యిపుడె బనిచెద
ఘనపర్వత మిటకుదెచ్చు గౌతుక మెసగన్ 124

కం॥ అని పనిచినంత హనుమంతు డపుడె యెగసి
చనుచునుండగ రావణు పనుపున నొక
దానవుడు కాలనేమి యాదారియందు
మౌనియైయుండి యా వాయుసూను నిలచి 125

ఆ॥వె॥ అనఘ నీవుబోవు ఘనకార్యమున కిది
తగినదారియంచు తప్పుజూపి
మకరిచేతజిక్కి మరణించు నితడంచు
తలచియుండె గపట తాపసుండు 126

కం॥ హనుమంతుడరిగి కొలనుఁ
గని బలముఁ దాగ్రవబోవగా మకరము గొ
బ్బునబట్టిమ్రింగ నుదరం
బును జీల్చుక బయలు వెడలి మొసలిని జంపెన్ 127

ఆ॥వె॥ మొసలినుండి యొక్క మగువ వెల్వడివచ్చి
పవనతనయుతోడ బలికెనిట్లు
నేను దేవకన్య మౌనిశాపమున
నిట్లు మొసలినైతి నింపుదక్కి 128

కం॥ నీవలన శాపముడగెను
పావని నిన్నిటకు జేరబంపినయతడా
రావణుని బంటుగావున
నేవిధముననైన వాని నిలగూల్చుమనెన్ 129

గీ॥ శక్తిసత్వము శ్రీరామచంద్రు నెదుట
కదనమున సాటిగాదయ్యె గప్వకైన
వర్షము విజృంభముగ మించివచ్చినట్లు
రావణునిముంచె బాణవర్షంబువలన 136

చ॥ ధనువున గంటమ్రోగిన హతమ్మగు లక్షయురాతులంద్రు రా
వణ రణమం దహర్నిశలవారక యేడు దినంబులెంతయుఁ
గణగణగంటమ్రోగె ననగఁ మరణించిన దైత్యులెందరో
గణనమొనర్ప నక్కజముగాదె రఘూద్వహు శక్తినారయన్ 137

కం॥ శిరములు దెగవేసినచో
మరిమరియని మొలచుచుండ మానవనాథుం
డరుదంది యవ్విభీషణు
నరసిన నతడిట్టులనియె నధిపతి తోడఁ. 138

గీ॥ అమృతకలశము నాభియం దమరియుండు
గాన యెన్నెన్ని సారులు కరశిరములు
కూల్చినను దానవేంద్రుండు కూలిపడడు
ఆయువంతయు నాభియందమరియుండు 139

కం॥ అని తెల్పిన శ్రీరాముడు
మునుకొని యాయమృత కలశమును దెగవేయుఁ
ఘనపర్వత మిలగూలిన
యనువున రావణుడు గూలి యసువులు విడిచెన్ 140

ఉ॥ అంత విభీషణుండు తనయన్న గతించిన దుఃఖపూరిత
స్వాంతముతోడ నాతనికి శాస్త్రవిధిన్ బరలోక సత్క్రియల్
సాంతముగానొనర్ప మనుజాధిపుడయ్యెడ నవ్విభీషణున్
జెంతకు జేరదీసి సువిశిష్టుని బట్టముగట్టె నిమ్ముగన్ 141

గీ॥ ఇటుల పట్టాభిషేకము నెలమిజేసి
రమణి సీతను బిల్చుక రమ్మటంచు
నా విభీషణు బంచిన నతడుదోయి
పై భవమ్మున గొనితెచ్చె వనజముఖిని

ఉ॥ పెన్నిధిగన్న పేదగతి ప్రేమవలిర్వగ రామచంద్రు డా
యున్నలమున్నమంగనిమె నారమణీమణి దీనచిత్తయై
కన్నబాష్పముల్ దొరల కాంతునిజూచి నమస్కరింప నా
విన్నదంబుగాంచి పృథివీపతి కూరిమిమీర యిట్లనెన్

కం॥ తరుణీమణి నీ మానస
మెరిగియు లోకంబుకొఱకు నీకిలమ్మున్
బరికింపదలచితిని భా
స్కరువంశంబునకు వన్నెగలుగ ధరిత్రిన్

కం॥ అని పల్కిన వనితామణి
అనలము దరికొల్పజేసి యాత్మేశుని నె
మ్మనమున దలచి చితిన్ జొర
ననలము గడుచల్లనయ్యె నందరు జూడన్

ఆ॥ చీర మాయలేదు చెమటబుట్టగలేదు
పూలువాడలేదు పొలతిమేన
కళలు తగ్గలేదు కనులు మూయగలేదు
అంతసేపు మంటయందునున్న

గీ॥ దేవతలు వచ్చి జానకీదేవి పరమ
సాధ్వియనిపల్కి యెంతయు సన్నుతింప
జానకిని రామచంద్రుడు సాదరముగ
చేరదీసెను సంతోషచిత్తుడగుచు

ఆ॥వె॥ తనపురమున కేగదలచి శ్రీరాముండు
వానరులనుబిల్చి వారి వారి
పురవరంబులకును బొండని పల్కిన
వినయమెసగ నిట్టులనిరివారు 148

గీ॥ స్వామి మీపట్టణమును మీ జనములను స
హోదరులజూడ గాంక్షించుచున్న మమ్ము
నరసి మీతోడ వచ్చునట్లానతిమ్మ
మాకనుచుబల్క స్వామి సమ్మతి వహించి 149

గీ॥ ఎంతమంది కూర్చుండిన యేమినూర్ల
మందికగుచోటు మిగులంగా నొందియుండు
నట్టి పుష్పక యానమ్మునందు నెక్క
పోవుదమటంచు దెప్పించె బుష్పకంబు 150

గీ॥ ఇటుల బయనించి సేతువు నెలమిదాటి
రామచంద్రుని యెదుట నారావణుండు
నిరచినట్టుల గన్పింప నెగులుజెంది
బ్రాహ్మణ పిశాచమనియెంచి భావమందు 151

గీ॥ శివునిలింగ మిందుజేర్చి ప్రతిష్ఠించి
పాపఫలము నిపుడె బాపుకొందు
ననితలంచి వాయునందనుతో లింగ
మిటకుదెమ్ము కాశికేగి యనగ 152

కం॥ అతండప్పుడె కాశికి
చేతోమోదమున నేగి శివునకు భక్తిన్
చేతులు మోడ్చి స్మరింపుచు
సీతాపతిదలచి తెచ్చె శివలింగమ్మున్ 153

గీ॥ ఇంతలోపల సుముహూర్తమింత మించి
పోవునట్లుగ దోచిన భూమిఘుండు
ఇసుకతో లింగమునుజేసి వెనప్రతిష్ట
జేయ హనుమంతు డటవచ్చి చింతనొంది 154

ఆ॥వె॥ దేవలింగమిటకు దెమ్మని ననుబంపి
యిట్టు లిసుకలింగ మిలప్రతిష్ట
జేసినారు నేనుజేసిన తప్పేమి
అరయనిది యనర్హ మయ్యెనేమొ 155

కం॥ అని చింతింపుచు బల్కగ
హనుమంతా వేళమీరినందున నేని
ట్లొనరించితి నీలింగ
మ్మును పెరుకుము మరల దానిబూన్చెద నిచట౯ 156

ఆ॥వె॥ అనగ నాంజనేయు డతిమోదమున దాని
నూడపెరికినేయ నూనియెంత
కష్టపడినగాని కదలనందున స్వామి
చరణములకుప్రాలి సంస్మరింప 157

ఆ॥వె॥ హనుమ నీవుదెచ్చినట్టి లింగము ముందు
భాగమున ప్రతిష్టసరగజేతు
సర్వజనులు దీని సందర్శనమ్మున
భూరిపుణ్యగతులు పొందగలరు 158

గీ॥ అని ప్రతిష్టించి హనుమంతు నాదరించి
ముందుగా నీవుబోయి యానందమెసగ
భరతునకు దెల్పుమనిచెప్పి పనిచినంత
వాయువేగముతోబోయె వాయుసుతుడు 159

కం॥ అక్కడ భరతుండగ్రజు
డెక్కడనున్నాడొ యిపటికింకను రాడే
దక్కట యేమాయెనొ యని
సొక్కుచు నుండంగ వాయుసుతు డరుదెంచెన్. 160

ఆ॥వె॥ స్వామి రామచంద్ర భటుడను హనుమంతు
డనెడివాడ భక్తినధిపునాజ్ఞ
ముందు తెలుపఁగోరి ముదమున వచ్చితి
వచ్చుచున్నవారు వారలిటకు 161

కం॥ అని తెల్పిన గడుముదమున
హనుమంతుని గౌగిలించి యశ్రులుగురుచున్
జనతతి గదలగ భక్తిని
తనయన్నకు నెదురుగాగ దరలిన యంతన్. 162

ఆ॥వె॥ స్వామి కెదురుబోయి సాష్టాంగముగ నమ
స్కృతులొనర్చినంత జెలువుమీర
కుశలమరసి భక్తి గురునకు తల్లుల
కెరగి పయనమైరి పురము జేర 163

గీ॥ పట్టణము జేరినంతట వైభవముగ
సర్వజనులును సంతోష జలధిదేల
రామచంద్రుడు ధర్మాభిరాముడగుచు
చెలువుమీరగ బట్టాభిషిక్తుడయ్యె 164

చ॥ జనకజ యంకమందు ననుజన్ములు శ్రేవల పాదసన్నిధిన్
అనిలజుడుం దివ్యకనకాంచిత రత్నమయాసనంబునన్
దినకర తేజమొప్పగను దేవతలెల్ల బరిస్తుతింపగా
ఘనతజెలంగ వైభవముగా రఘురాము డెసంగె నప్పటిన్ 165

ఆ॥వె॥ వానరాది హితుల వారివారిండ్లకు
బంపి రామచంద్రు డింపుమీర
పదునొకండువేల వర్షంబులిలనేలె
భరతు యౌవరాజ్యభరితుజేసి 1

కం॥ అనియివ్విధి గ్రీస్తుశక
మ్మున పందొమ్మిది శతాబ్దముల దెబ్బదియా
రున నీపంచమభాగ
మ్మును రాస్తాడోబిరెడ్డి పూర్తియం జేసెన్.1

కం॥ ఈ రామాయణ కథ నె
వ్వారేనియు జదువ వినన వ్రాసిన వారిన్
శ్రీరామకృప సంపద
లారోగ్య శుభంబు లొందనయ్యెడు గాకన్. 16

:— సంపూర్ణము :—



# అవ్వారి నారాయణ జీవిత సంగ్రహము

జన్మస్థలము:— నీలారెడ్డిపల్లె, కొర్రపాడు(P.O.) బుక్కరాయసముద్రము, అనంతపురం తాలూకా, అనంతపురం జిల్లా.

తల్లిదండ్రులు ;- అచ్చమ్మ, పెద్దరంగప్ప

జన్మదినము:- 1-7-1929 సం॥

విద్యాభ్యాసము :- ఇంటర్ వరకు, తెలుగు విద్వాన్

ఉద్యోగము :- తెలుగు పండితులు

అభిమానము :- రచనము - సాహిత్య పోషణము

రచనలు :- 1) అనంతపుర మండల తెలుగు రచయితలు, 3) అనంతపుర మండలేతర తెలుగు రచయితలు 3) పర్యాయపద నిఘంటువు 4) వ్యుత్పత్తికోశము 5) అచ్చ తెనుగు నిఘంటువు- 6) బుక్కరాయ సముద్రము.

సన్మానములు :- రాయలసీమ కవుల సభ, అనంతపుర కేంద్ర గ్రంథాలయము, ధర్మవరము కళాజ్యోతి, చెన్నేకొత్తపల్లి ఉపాధ్యాయ సమితి - గార్లదిన్నె హైస్కూలు మొదలగు చోట్ల.

ప్రభుత్వ సన్మానములు :- 1978 మార్చిలో ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు. 1978 సెప్టెంబరులో State Award, 1983 సెప్టెంబరులో State Award పొందుట.

హైదరాబాద్ పబ్లిక్‌గార్డెన్స్ జూబిలీ హాలులోను, ఇందిరా ఆడిటోరియంలోను ముఖ్యమంత్రిచే సన్మానము, విద్యామంత్రిచే బహుమతి ప్రదానము.